# ఆంతరంగిక జీవితము.

[ప్రథమద్వితీయభాగములు.]



ఇది

నిడమర్తి వేంకటనరసింహారావుచే

ఆంధ్రీకరింపఁబడియె.



రెండవకూర్పు 1000 ప్రతులు.

ఏలూరు,

రామా ముద్రాక్షరశాల.

1919.

వెల 0-9-0.

**This book is most respectfully**

*DEDICATED*

**TO**

**The Rev. C. W. A. Clarke,** M. A.

*Late Principal of the 'Noble College',*

**MASULIPATAM**

**in token of gratitude**

**for the education received**

*with his help*

BY

*THE AUTHOR*

# పీఠిక.

ఈపుస్తకము టామస్-కెంపిస్ అను క్రయిస్తవఋషి కొన్నివందల సంవత్సరముల క్రిందట ఫ్రెంచి భాషయందు రచియించిరి. పిదప ఆగ్రంథము ఆంగ్లేయ భాషలోనికి భాషాంతరముచేయబడెను. ఇప్పుడది ఆంగ్లేయ భాషనుండి ఆంధ్రభాషలో వ్రాయబడినది. ఈ ఆంగ్లేయగ్రంథము నాచిన్నతనమునందు క్రీస్తుప్రభువునందు భక్తి నాహృదయమున నుదయించుచుండిన కాలమున అదృష్టవశాత్తు నాచేతజిక్కెను. దానిననుదినము పఠించుటచేత నాలో క్రీస్తునందలి భక్తియును క్రీస్తుదాసుడను కావలయునను నిశ్చయమును నెలకొని వృద్ధిపొందెను. తదారభ్య ఈపుస్తకము ఆంధ్రభాషయందు వ్రాయవలయునని పలుమారుకోరితినిగాని యెటులనో ఆయుద్దేశము సఫలముకాకయే కాలముజరిగిపోయెను. ఈపుస్తకమునందలి యుపదేశము రుచిచూచిన మ. రా. శ్రీ నిడమర్తి వెంకట నరిసింహారావుగారు దీని భాషాంతరీకరించి తనస్వంతద్రవ్యము వ్యయముచేసి దీనిప్రచురించి నాకొక ప్రతియియ్యగా చదివి యీనాటికి నాకోరిక యీడేరెగదాయని సంతుష్టుడనైతిని. ఈ భాషాంతరమునందు అల్పదోషములున్నను గ్రంధములోని రసము చెడకుండ సులభశైలిని నరసింహారావుగారు తాబూనినపని నెరవేర్చినందుకు సంతోషించుచున్నాను. క్రయిస్తవకోటిలో చేరనివారైనను భక్తియనుభవముగలవారు ఈపుస్తకమును ఆశతో చదువుచున్నారని విని యానందించుచున్నాను. ఇది క్రయిస్తవ జనులలో భక్తివైరాగ్యము లభివృద్ధిచేయజాలిన పుస్తకము గనుక క్రయిస్తవకోటియును నరసింహారావుగారి యెడల కృతజ్ఞులై యుండవలసియున్నారు.

బెజవాడ.<br>
డిసెంబరు 1919 సం॥

ధన్నవాడ అనంతం.



# ఆంతరంగిక జీవితము.

## ప్రథమ భాగము.

### క్రీస్తు ననుసరణ, ప్రపంచకవిషయ నిరసనము.

"నన్ను వెంబడించువారు చీకటిలో నడవరు" అని ప్రభువు చెప్పెను. క్రీస్తు చెప్పిన యీమాటలను బట్టి మనస్సు యొక్క గ్రుడ్డితనమును తొలగించు కొనదలచి నప్పుడును తెలివి తేటలం దనుచుకొన గోరినప్పుడును ఆయన పావన జీవితమును పరిశుద్ధ ప్రవర్తనను మనము అనుసరించవలెను. ఏసుక్రీస్తుయొక్క పవిత్ర జీవితమును జక్కగా హృదయమున అలవరుచుకొనుటయే మనమిప్పుడు చేయవలసియున్న ముఖ్య కార్యము. యోగులు జ్ఞానులు మొదలయిన వారందరు బోధించిన బోధనలకన్న ఆయన బోధనలు మిగుల వన్నెకెక్కి యున్నవి. జ్ఞానము గలవారందరు దానియందు దాగియున్న దివ్యప్రసాదమును గనిపెట్టుచుండిరి. అనేకులు క్రీస్తుయొక్క సువార్తలను తరుచుగా వినుచున్నను వాటిని అనుభవమునకు దెచ్చుకొనలేక పోవుచుండిరి. ఎందుచేతననగా క్రీస్తుయొక్క

జ్ఞాన తేజస్సు వారు కలిగియుండలేదు. క్రీస్తు చెప్పిన మాటలు చక్కగా మనస్సుననాటి వాటియర్థమును పూర్తిగా తెలిసి కొనినవారు క్రీస్తుజీవితముతో తమ జీవితములు అన్యోన్యమై యుండుటకు గట్టిగా ప్రయత్నింపవలెను. అణకువను విడిచి మూర్తిత్రయసిద్ధాంతమును ద్వేషించినప్పుడు ఆసిద్ధాంతమును గూర్చి వాదించిన నేమిలాభము? గొప్ప సంగతులను మాటాడి నంతమాత్రముచేత అవిమనుష్యునకు పావనత్వమును గలిగింప నేరవు. యోగ్యమైన జీవితము మాత్రమే మనుష్యుని దేవుని యనుగ్రహమునకు పాత్రునిగా జేయుచున్నది.

వేదము నంతటిని పూర్తిగా జదివినను శాస్త్రధర్మము లన్నిటిని తెలిసికున్నను దేవుని ప్రేమింప లేనప్పుడును ఆయన యనుగ్రహమును బొందలేనప్పుడును ఏమి ప్రయోజనము? వ్యర్థము వ్యర్థము సమస్తమూ వ్యర్థమే. ఆ తెలిసి కొనిన తెలివి అంతయు నిష్ప్రయోజనమైనది. దేవుని ప్రేమించు టయు సేవించుటయు ఈ రెండు సంగతులు మాత్రమే మను ష్యునకు లాభకరమైనవి. తక్కిన వన్నియు లాభములేనివె. దేవుని రాజ్యమును సమీపించుటకు నీవీప్రపంచకమునంతయు తిరస్కరింప నేర్చుకొనుటయే గొప్పజ్ఞానము. నాశన స్వభావ ముగల ధనమునపేక్షించి దానిని సంపాదింప బ్రయత్నిం చుట లాభము లేనిసంగతి. ఆత్మనుబాధించెడి తుచ్ఛ ములైన శరీరభోగముల నపేక్షించి వాటినిమిత్తము పాటు పడుట సైతము లాభములేని సంగతే. ముందు తా ననుభ వింపబోయెడి సంగతిని ఎంతమాత్రము పాటింపక ప్రస్తుత

జీవితముకొరకు పాటుపడుటకూడ లాభములేని సంగతే. తన జీవితకాలమును చక్కగా వినియోగింపక పాడుచేసికొనుచూ, చాలా కాలము బ్రతికియుండ గోరుట కూడా లాభములేని సంగతే. శాశ్వతమైన ఆనందము కొరకు ఎంత మాత్రము ప్రయత్నింపక అశాశ్వత పదార్థముల ప్రేమించుట సైతము లాభములేని సంగతే. "చూచుటచేత కన్ను తృప్తి పొందకున్నది. వినుటచేత చెవికి తృప్తి కలుగుటలేదు." అను సామెతను జ్ఞప్తికి దెచ్చుకొనుము. కనుక నీకనులకు గనుపించుచున్నవస్తువుల నుండి నీమనస్సును మరలించుకొని యీ కనులకు గనిపించని గొప్ప విషయములను అపేక్షింప బ్రయత్నింపుము. నీయింద్రియ సంబంధములైన కోరికలను వెంబడించితి వేని నీహృదయమును మైలపరచుకొని దేవుని యనుగ్రహమునకు దూరమవుదువు.

## రెండవ ప్రకరణము.

### తనకు గలిగిన తెలివికి గర్వింపక అణకువగలిగియుండుట.

మనుష్యులందరు స్వాభావికముగా జ్ఞానము సంపాదించుకొనుటకు కోరుచున్నారు. దేవునియెడల భయములేనప్పుడు ఆజ్ఞానమేమిలాభము? తన ఆత్మ నుపేక్షించి శాస్త్రాభ్యాసము చేయుచున్న గర్వితుడైన పండితుని కంటె దేవుని సేవించెడి పొలముదున్నుకొనుచున్న కాపువాడు మిగుల ఉత్తముడు. తన్ను తాను చక్కగా తెలిసికొనినవాడు తన

దృష్టికి తాను నీచుడుగా గనిపించుచుండును. కనుక అతడు మనుష్యులుచేయు స్తుతులకు ఇష్టపడడు. దాన ధర్మముల చేయక, ప్రపంచక సంగతులన్నిటిని నేను తెలిసికొనియున్నను, నేనుచేయుచున్న కార్యములను బట్టి నన్ను విచారించుచున్న దేవుని ముందర నాకవి ఏమిలాభము? జ్ఞానముకొరకు నీవు కలిగియున్న పేరాసను విడిచిపెట్టుము. అందువలన నీ మనస్సు భ్రమజెందుటకును కలవరపడుటకును కారణమగును. పండితులు తమ పాండిత్యమును తెలివితేటలను లోకమునకు వెల్లడిచేసి పేరుపొందవలెనని కోరుచున్నారు. తెలిసికొన్నను ఆత్మకు లాభములేనిసంగతు లనేకములు గలవు. తానురక్షణ పొందతగిన సంగతులను విడిచిపెట్టి తనకులాభములేని సంగతులను దెలిసికొన ప్రయత్నించెడివాడు పరమమూర్ఖుడు. ఎన్ని చదువులు చదివినను, ఎన్నిమాటలు నేర్చినను అవి యేమియు ఆత్మకు తృప్తిగలిగింపనేరవు. ఉత్తమమైన పావన జీవితముమాత్రమే మనస్సునకు శాంతి గలిగింప గలిగినది. పరిశుద్ధమైన అంతరంగము దేవునియందు గొప్పనమ్మకమును గలిగించుచుండును. నీజ్ఞాన మతిశయించిన కొలదిని, నీజీవితము మరింత పరిశుద్ధమై నిర్మలముగా ప్రకాశింపనియెడల నీవు దేవుని వలన మరింత గాఢముగా విచారింపబడుదువు. కనుక నీవు గొప్ప తెలివి గలవాడవనిన్ని చాలా సంగతుల దెలిసికొంటివనిన్ని ఎంచి మనస్సునందు గర్వింపకుము. కనుక నీవు కలిగియున్న తెలివిని నీకు మరింత యణకువను గలిగించి నిన్ను జాగ్రతగా నడిపింపనిమ్ము. నీవు చాలాసంగతులను దెలిసియున్నట్టు భా

వించుచున్న యెడల ఇంకను నీకు దెలియని సంగతు లనేకము లున్నవని తెలిసికొనుము. నీకునీవే బుద్ధిమంతుడవని భావింపకుము. నీకేమీ తెలియదని ఒప్పుకొనుము. నీ కన్నను దేవునిసంగతులను ఎక్కువగా తెలిసికొనినవారు చాలామంది యుండగా అందరికంటెను నీకెక్కువ తెలుసునని నీవేల గర్వించెదవు? నీకేదియైనా లాభకరమైన సంగతి యొకటి తెలిసిన యెడల అది నీకు తెలియనట్టును అది యొక గొప్ప సంగతి కానట్టును ఎంచుకొనుము. మన మనస్సును మనము చక్కగా విచారించుకొని మన మందరికంటెను కడపటగా నున్నట్టు తెలిసికొనుటయే మనము తెలిసికోతగిన గొప్పసంగతి. అందరికంటెను తాను అధమాధముడని యోచింప గలుగుటయే గొప్ప జ్ఞానము. తన కేమీ తెలియదనియు, ఏసంగతిలోను తాను గొప్పవాడుకాడనియు యితరులే తనకన్న గొప్పవారనియు గ్రహింపగలుగుట పరిపూర్ణత్వమునకు గురుతని తెలిసికొనుము. బహిరంగముగా పాపకార్యముల జేయుచున్న వారిని నీకంటితో నీవు స్వయముగా జూడ గలిగినప్పుడు కూడా వారికంటె నీవు మంచివాడవని యోచింపకుము. ఎందుచేతననగా ఇపుడు నీవు కలిగియున్న నిర్మలస్వభావమును ఎంతకాలము నీవు కలిగియుండగలవో నీవెరుగవు. ఎందుచేతననగా మనుష్యస్వభావము చెడ్డది. నీకన్న చెడ్డవారెవ్వరును లేరని తెలిసికొనుము.

---

## మూ డ వ ప్ర క ర ణ ము .

## సత్యోపదేశము.

సత్యము గతించు చున్న మాటల చేతను అక్షరముల చేతనుగాక, నిజముగా దావంతట అదియెవనికి బోధపడు చున్నదో అతడుమాత్రమే నిజముగా ధన్యుడు. వస్తుస్వభావమును మనము చక్కగా పరిశీలించి కనిపెట్ట లేకపోవుటచే యభిప్రాయములును భావములును మనలను మోసము చేయుచున్నవి. చీకటిలో దాగియున్న సంగతులను ఎంతకాలము విచారించినను మనకు దెలియునా? తెలియని సంగతుల నెంతతర్కించినను ఏమిలాభము. అట్టిసంగతులను మనము తెలిసికొనక విడిచిపెట్టినందుకు విచారణ దినమున మనము తిరస్కరింపబడము. మనకు లాభకరములైనట్టియు అవసరములైనట్టియు సంగతులను తెలిసికొనక యుపేక్షించుటయు లాభము లేని యపాయకరములైన సంగతులను అదేపనిగా మనకుదోచినట్లెల్ల యోచించుటయు వ్యర్థములని గ్రహింపుము. మనము కన్నులున్నను చూడలేము. నిష్ప్రయోజనములైన తర్కవాదములయందు మనమేల ప్రవేశింప వలయును? ఎవనికి శాశ్వతమైన దైవవచనము వినిపించుచున్నదో ఆమనుష్యుడు పనికిమాలిన యనేక వాదములనుండి కాపాడబడుచుండును. ఆమాటనుండియె సర్వము బయలు పడుచున్నది. సర్వము ఆయననే సూచించు చున్నవి. సర్వమునకు ఆయనే మూల కారణము. ఆయన మనతో మాట్లాడు చున్నాడు. మనకు

బోధించుచున్నది ఆయనే. ఆయన లేనిదే మనము దేనిని దెలిసి కొనలేము. ఏసంగతిని సరిగా ఆలోచింపలేము. ఎవడు ఈ సంగతిని కనిపెట్టి సర్వకార్యముల యందును ఆయననే నిదానించి యోచించు చుండునో ఎవడు సర్వవస్తువులను ఆయన యందు కనిపెట్టుచుండునో ఆతడు మాత్రమే చిత్తశాంతినొంది దేవునియందు విశ్రమింపగలిగి యుండును.

ఓ సత్యస్వరూపుడా! శాశ్వతమైన ప్రేమయందు నన్ను నీతో ఏకీభావము నొందింపుము. పెక్కు చదువులు చదువుటయు పెక్కు సంగతులు వినుటయు నాకు విసుగుపుట్టించుచున్నవి. నేనపేక్షింప దగిన సంగతులన్నియు నీయందున్నవి. బోధకులందరు నోరెత్తకుందురు గాక! ఈ ప్రపంచకము యొక్క యావత్తు విశ్రాంతియు నీ స్వరూపమునందే ప్రకాశించు చుండును గాక! నీవుమాత్రమే నాకుపదేశింతువు గాత!

మనస్సు చలింపక నిర్మలత్వ మతిశయించిన కొలదిని మనుష్యుడు గొప్పసంగతులను సులభముగా యోచింప శక్తి గలిగి యుండును. ఎందు చేత ననగా వానిమనస్సు దేవుని జ్ఞాన తేజస్సుతో పూరింపబడి ప్రకాశించు చుండును. నిష్కపటమైన స్థిరచిత్తుడు అనేక కార్యముల చేయవలసియున్నను కలతనొంద నేరడు. దేవునిమీాద ప్రేమచేత ఆతడా కార్యముల చేయుచున్నను స్వలాభము నపేక్షింప కుండుటచే ఆతడు మనస్సునందు నెమ్మది కలిగి యుండును. నీ మనస్సున పెరిగి యున్న అపరిశుద్ధమైన మోహాముగాక నిన్ను బాధించుచున్న

శత్రువు వేరొకటి కలదా ? భక్తిగల మంచి మనుష్యుడు తాను బహిరంగముగా నెరవేర్ప వలసి యున్న విధులను మనస్సునందు ఏర్పరుచుకొనును. ఆవిధుల నెరవేర్చు నప్పుడు దుర్భావములను దురాలోచనలను గలిగియుండడు. సహేతుకరమైన ఆలోచనతో తాను చేయవలసి యున్న కార్యములన్నిటిని క్రమముగా చేయుచుండును. తన్ను తానుజయింప బూనిన బుద్ధిమంతునికంటె యెక్కువ పోరాటమును గలిగి యున్న మహా శూరుడెవ్వడు ? మన మనస్సును మనము జయించి దానిని ఒకనాటికన్న ఒకనాడు క్రమక్రమముగా స్వాధీన పరుచుకొని యోగ్యమైన మార్గమున యభివృద్ధి జేసుకొనుటయే మనము చేయవలసియున్న మొదటి కార్యము. ఈ ప్రపంచక సంబంధమైన పరిపూర్ణత్వ మంతయు కొంత అసంపూర్తితో గూడి యున్నది. కనుక మనమెంత తెలిసికొన్నను మనజ్ఞానమునకు కొంతకొరత కలిగియున్నది. గాఢమైన శాస్త్రజ్ఞానము కంటె నిన్నునీవు తెలిసి కొనుచున్న స్వల్పజ్ఞానము నిశ్చయముగా దేవుని దగ్గరకు నిన్ను దీసుకు వెళ్ళగలదు. అయినను జ్ఞానము దాని నిజస్వభావమును బట్టి యోచించు నపుడును అందుమూలమున మనము తెలిసికొనుచున్న సంగతులను బట్టి యోచించి నప్పుడును అది నిందింప తగనిది. ఎందుచేతననగా అదిమంచిది. దేవునిచే నియమింప బడినది. అయితే యోగ్యమైన జీవితము, పరిశుద్ధమైన మనస్సు, దానికంటె మిక్కిలి మంచివి. అనేకులు యోగ్యముగా జీవింప నేర్చుకొనుట కంటె జ్ఞానమును సంపాదించుటకు ఎక్కువగా

శ్రమపడు చున్నారు. అందుచేతవారు తప్పు త్రోవనుబడి తమ
శ్రమకు దగిన ఫలమును అనుభవింపలేక పోవు చున్నారు.
వారు సంగతులను తెలిసికొనుటకు ప్రశ్నలవేయ గలిగినట్లు
దుర్మార్గమును పెరికివైచుటకును సన్మార్గమును నిలవ బెట్టు
టకును వారు ప్రయత్నింప గలిగినయెడల లోకములో
ఇప్పుడు కనపడుచున్న బాధలును కష్టములును ఉండకపోవును.
మతమునందు సైతము ఇన్నిలోపములు కనిపించకపోవును.
తీర్పుదినము సమీపించినప్పుడు దేవుడు మనముచదివిన చదువు
లనుబట్టి యోచింపడు. మనము చేసియున్న పనులనుబట్టి
మాత్రమే మనల విచారించును. మనము . చెప్పినమా
టలయొక్క మంచి తనమునుబట్టి విచారింపడు. మనము
జీవించిన జీవితముయొక్క యోగ్యతనుబట్టి మనల ఆలోచిం
చును. ఇంతకుముందు నీవెరిగియున్న పండితులును ధనవంతు
లును బలవంతులును ఇపుడేమైరి ? వారలందరు గతించిరి.
వారిస్థానములను ఇతరు లాక్రమించుకొనిరి. వారలను ఎవరును
ఇపుడు తలుచుకొను చుండుటలేదు. వారు జీవించియున్న
ప్పుడు వారి గొప్పతనము వెయ్యినోళ్ళతో బాగడబడియుం
డెను వారినిప్పుడు చెప్పుకొనువా రెవ్వరూలేరు. ఈ ప్రపం
చక వైభవము ఎంతశీఘ్రముగా గతించుచున్నది! వారిజీవి
తములు వారి జ్ఞానముతో ఏకీభవించియున్నయెడల వారి చదు
వులును శాస్త్రజ్ఞానమును కొంతవరకు లాభముగానుండును.
దేవుని సేవింపక విద్యార్థులు ఎందరు గర్వముచే నశించు
చుండిరి. ఎందుచేతననగా వారందరికంటెను దీనులై యుండుట

కంటె గొప్పవారుగా నుండుటకు మిగులకోరుచుండిరి. కనుక వారు తమ ఆలోచనయందు వ్యర్థులైరి. దానధర్మములయందు అధికుడైనవాడు నిజముగా గొప్పవాడు తనదృష్టికి తాను కొద్ది వాడుగా గనిపించు చున్నవాడు గొప్పవాడు గొప్ప పదవులయొక్క గౌరవముల నాశింపనివాడు నిజముగా అందరికంటెను గొప్పవాడు. క్రీస్తును సంపాదించుకొనుటకు శరీర భోగములను ప్రపంచక సంగతులను మట్టియుండవలె నస హ్యించుకొని విడిచిపెట్ట గలిగినవాడు నిజముగాజ్ఞానవంతుడు.

## నాలుగవ ప్రకరణము.

## కార్యాచరణ వివేచనము.

వినినవెంటనే యేసంగతిని విశ్వసింప గూడదు. దానిని దేవునిసంబంధమును బట్టి సావకాశముగా జాగ్రతగా విచారింపవలెను. అయ్యో! మనమనస్సు ఎంతబలహీన మైనది! మంచిమాటకంటె చెడ్డమాటను సులభముగానమ్ముచున్నాము. మనము వినిన చెడ్డసంగతిని వెంటనే అందరికి తెలియజేయుచున్నాము. పావనత్వమున అభివృద్ధి చెందిన బుద్ధిమంతులు తామేసంగతిని విన్నను దానిని సులభముగా నమ్మరు. ఎందుచేతననగా నరునిస్వభావము మిగుల దుర్బలమైనదనియు అందుచే అదిచెడుగు చేయుటకు కోరుచుండుననియు వారెరుగుదురు. మనుష్యుడు తానాడినమాట తప్పిపోవుచుండుటకు

కూడ ఇదే కారణము. కార్యముచేయునపుడు తొందరపడ కుండుట జ్ఞానవంతుని లక్షణము. తనకుకలిగిన దురభిప్రాయ మును విడిచిపెట్టక అదేపనిగా మూర్ఖముగా పట్టుపట్టియుం డుట అవివేకి లక్షణము. తాను వినినప్రతిసంగతిని నమ్మక పోవుటయు నమ్మిన ప్రతిసంగతిని వెంటనే యితరులకు వెల్ల డింపకుండుటయు బుద్ధిమంతుని యందుండవలసిన యుత్తమ లక్షణములని తెలిసికొనుము. నీకుగలిగిన ఉపాయములను ఆలోచనలను నీవు వెంబడించుటకంటె నీకన్న బాగుగా దెలిసిన బుద్ధిమంతుల యభిప్రాయములను ఆలోచనలను అంగీక రింపుము. దేవుని యభిప్రాయమును బట్టి పావనజీవితము మనుష్యుని జ్ఞానవంతునిగా జేయుటయేగాక, మంచియనుభవ మును సైతము కలిగించును. మనుష్యుడు తనకుతాను విధే యుడై యున్నకొలదిని దేవునికి మరింత పరమ విధేయుడై యుండును.

అట్టి మనుష్యుడు మాత్రమే తెలివికలవాడై అధికమైన చిత్తవిశ్రాంతి ననుభవింప గలిగియుండును.

## అయిదవ ప్రకరణము.

### వేదపఠనము.

సత్యమును గ్రహించుటకు వేదమును జదువవలయును. అంతేకాని అందు వ్రాయబడిన మాటలయొక్క అందమును

గ్రహించుటకు గాదు. ఎవనివలన వేదము వ్రాయబడినదో ఆమహానుభావుని జ్ఞానసహాయమును బొంది భక్తితో దానిని జదువవలెను. దానిని వాదము నిమిత్తము జదువరాదు. లాభము నిమిత్తమే దానిని చదువవలెను. మనము చదివెడి గ్రంథములు సులభములై భక్తినిగలిగింపదగినవిగా నుండవలెను. మనము వాటిని చదువునప్పుడు గ్రంథకర్తల పాండిత్యమును పాటింపక సత్యమును తెలిసికొనుటకు మాత్రమే ప్రయత్నింపవలెను. వాటిని వ్రాసినవారిని తెలిసికొన ప్రయత్నింప నవసరములేదు. అందువ్రాయబడిన సంగతులను మాత్రము చక్కగావిచారించి తెలిసికొనుము. మనుష్యులుగతించిరి. దైవనిర్మితములైన అందలిసత్యములు మాత్రము శాశ్వతముగా బ్రకాశించుచున్నవి. మనుష్యుల తారతమ్యమును పాటింపకయే దేవుడు మన కనేకవిధముల బోధించుచున్నాడు. మనము సులభముగా చదివి తెలిసికోవలసిన భాగములను వాదించుటకును తర్కించుటకును అపేక్షించి చదివినప్పుడు అనేకసంశయములు బయలుదేరి మనలచదువనియ్యక అడ్డుపెట్టుచుండును. నీవు నిజముగా లాభమును పొందగోరినయెడల విశ్వాసముతో నిష్కపటముగా చదువుము. నీపాండిత్యము వెల్లడించుకొనుటకు ఎన్నడును చదువకుము. నీసంశయముల నడిగి తెలిసికొనుటకు నీవెన్నడు వెనుకదియకుము. మహాత్ములు చెప్పుచున్నదానిని మౌనముతో నాలకింపుము. పెద్దలు చెప్పిన సంగతులయందు అపనమ్మకమును గలిగియుండకుము. వారు కారణములేనిదే అట్టి సంగతులను అచట నుదహరించియుండరు.

# ఆరవ ప్రకరణము.

## అనివార్యమైనమోహము.

మనుష్యుడేవస్తువునైనను అణచిపెట్టలేని కోరికతో ఆశించినయెడల చిత్తశాంతిని పోగొట్టుకొనును. ఆశపాతకులును గర్వపోతులును ఎన్నడు మనస్సునందు నెమ్మదిగలిగియుండరు. గర్వములేనివారును, దీనులును ఎల్లప్పుడు చిత్తశాంతిని గలిగియుందురు. తనమనస్సును పూర్తిగా చంపుకోలేనివారు తుచ్ఛములైన అల్పసుఖములవలన ఆకర్షింపబడుచుందురు. తనమనస్సునందు బలములేనివారును శరీరాభిమానమును పూర్తిగావిడిచిపెట్టలేనివారును ప్రపంచకసంగతులయందు అనురాగముగలవారును ప్రపంచకకోరికలనుండి మనస్సును మరలించుకొననేరక మిగుల బాధపడుచుందురు. అట్టివారాకోరికలను విడిచిపెట్టవలసివచ్చినప్పుడు మిగుల విచారపడుటయేగాక ఎవరైన వారిని మందలించినప్పుడు వారికి పట్టరాని కోపముగలుగును. ఎవరైనతనకోరికల వెంబడించినయెడల వానియాత్మ పాపముచే దుఃఖింపవలసియుండును. ఎందుచేతననగా వాడాకోరికలకు చిక్కియున్నందున వాడు పొందనపేక్షించుచున్న చిత్తశాంతిని వానిమనస్సు అనుభవింప లేకపోవుచున్నది. నిజమైన చిత్తవిశ్రాంతి మన కోరికలను మొదలంట నణచిపెట్టుటవలనగలుగుచున్నది. మనస్సునందు కోరికలుపుట్టుచున్నంతవరకు ఎన్నడు చిత్తవిశ్రాంతిగలుగదు. కనుక శరీరాభిమానమును విడిచిపెట్టలేని వానికిని ప్రపంచక సంగతులయందు ఆసక్తిగల వానికిని

చిత్తవిశ్రాంతి యెన్నడు దొరకదు. ఆత్మజీవితమునజీవింపనేర్చిన భక్తులకుమాత్రమే అది లభించుచున్నది.

## ఏడవ ప్రకరణము.

## స్వాభిమానవిసర్జనము, దురాశాపరిత్యాగము.

నరులనుగాని శరీరమును ధరించిన యితర జీవులనుగాని నమ్మియుండుట లాభము లేదు. ప్రభువైన యేసునిమిత్తము నీవితరులను సేవింపవలసి యున్నందుకును లోక దృష్టికి దీనునివలె కనిపించుచున్నందుకును నీవు సిగ్గుపడకుము. నీస్వశక్తిమీద నెంతమాత్రము ఆధారపడియుండక నీనమ్మకమునంతయు దేవునిమీదనే నిల్పుము. నీవు చేయవలసియున్న దానిని నీవు చేయగలిగినంతవరకు చక్కగా చేయుము. దేవుడు నీమంచిప్రయత్నములకనుకూలించి నీకు తోడుపడును. నీ తెలివిని నీవెంతమాత్రము నమ్మకుము. ఇతర శరీరులయొక్క ప్రజ్ఞనుసైతము విశ్వసింపకుము. దేవుని అనుగ్రహమును మాత్రమేనమ్మియుండుము. ఆయన దీనులను రక్షించుటకును గర్వముగలవారిని అణగద్రొక్కుటకును సమర్థుడు. నీవుధనముగలిగియున్నను అందుకు సంతోషింపకుము. నీవు స్నేహితుల గలిగియున్నను ఆనందింపకుము. వీటివలన కొంతవరకు నీబలమతిశయింపవచ్చును. కాని ఈసర్వమును నీకు దయచేయుచున్న దేవుని యనుగ్రహమునకు మాత్రమే నీవు సంతోషించుచుండుము. నీవు అన్నిటికన్నను ముఖ్యముగా ఆయననే కోరుకొనుము. నీవు అందమైన

వాడవని గర్వింపకుము. రోగములు నీఅందమును పాడుచేసి నీరూపమునకు వికృతమునుగలిగింప గలవు. స్వాభావికముగా నీయందు కనిపించుచున్న ప్రజ్ఞను దలచుకొని ఉప్పొంగకుము. అందువలన మనకు సర్వశక్తులను స్వతస్సిద్ధముగాదయ చేసియున్న సర్వేశ్వరుని యనుగ్రహమునకు నీవు దూరముగా నుండ వలసియుందువు. ఇతరులకంటె నీవు గొప్పవాడవని అనుకోకుము. మనుష్యునిమనస్సునందున్న దానిని కనిపెట్టిచూచుచున్న దేవుని దృష్టికి నీవందరి కంటెను తక్కువవాడవుగా కనిపించవచ్చును. నీవు చక్కగా నడుచుకొనుచున్నావని గర్వింపకుము. దేవుని విచారణమనుష్యుల విచారణకు వేరుగానుండును. మనుష్యులకు ఉల్లాసకరమైన సంగతులు దేవునికి ఆగ్రహకారణములై యుండవచ్చును. ఏదైనా కొంచెము మంచిసంగతి నీయొద్ద నున్నట్టు నీవు తలచితివేని అంతకన్న యెక్కువమంచి సంగతి యితరులవద్దకూడా ఉన్నదని యోచింపుము. అందువలన నీయణకువను నీవు చక్కగా కాపాడుకొనగలవు. అందరికంటెను నీవు తక్కువ వాడవని యోచించుటచే నీకు నష్టమెంతమాత్రము లేదు. ఒకనికంటె నీవెక్కువవాడవని తలచుటచేతనే నీకు హాని గలుగుచున్నది. దీనులహృదయమెప్పుడును తెంపులేక నెమ్మది గలిగియుండును. గర్వితులమనస్సు కామ క్రోధాదులచే ఎడతెగక కలత చెందుచుండును.

---

# ఎనిమిదవ ప్రకరణము.

## అమిత పరిచయ విసర్జనము.

నీహృదయ మెవరికిని తెరచిచూపకుము. దైవభీతి కలిగిన పుణ్య పురుషులకు మాత్రమే నీస్థితిగతులను వివరింపుము. చిన్న వారితోను జారత్వము గలవారితోను విశేషముగా సంభాషింపకుము. భాగ్యాధికారముగల గొప్పవారి యొద్దకు తరుచు వెళ్ళకుము. ధనవంతుల సమీపించి వారిని ముఖస్తుతులు చేయకుము. యోగ్యులతోను భక్తులతోను నిష్కపటులతోను దీనులతోను స్నేహముచేయ బ్రయత్నింపుము. నీమనస్సును ప్రకాశింపజేయ గలిగిన మంచిసంగతులను వారితో సంభాషించు చుండుము. ఏస్త్రీతోను ఎక్కువ పరిచయముగలిగి యుండకుము. కాని యోగ్యమైన స్త్రీలను దేవుని సేవింప ప్రేరేపింపుము. మనుష్యుల పరిచయమును విడిచిపెట్టి దేవునితోను దేవదూతలతోను పరిచయము గలిగియుండుము. దానధర్మములు అందరియెడల చేయవచ్చును. స్నేహమందరితోను చేయకూడదు. ఒకానొక సమయమున మనమెరుగని మనుష్యుడు మంచి వాడుకను గలిగి యుండ వచ్చును. కాని అతడు మనల సమీపించినపుడు వానిలోపములు కొన్ని మనకు గనిపించి వానియెడల మనకసహ్యము గలుగవచ్చును. కొన్ని సమయముల యందుమనము ఇతరులతో స్నేహము చేయుట వలన వారినిసంతోషపెట్టగల మని తలచుదుము. కాని వారు మనతో స్నేహము చేసిన తరువాత మనయందు కొన్ని దోష

ములు వారికి గనిపించి వారు మనల నసహ్యించుకొనుట తట సింపవచ్చును.

---

తొమ్మిదవ ప్రకరణము.

## వినయము విధేయత.

నీకు నీవు స్వతంత్రుడవై యుండుటకంటె యితరులకు లోబడియుండుట లాభకరము. ఇతరులను తాను లోబరుచు కొనుటకంటె ఇతరులకు లొంగియుండుట క్షేమము. అనేకులు యిష్టము లేకనే అవసరమును బట్టి యితరులకు లోబడు చుండిరి. కాని వారి మనస్సునకు నొప్పిగలిగి నప్పుడు అది వారికి బాధకరముగా నుండి మొరబెట్టుదురు. అందువలనవారి మనస్సులకు కొంచెమైనను స్వాతంత్రియము గలుగు చుండ లేదు. దేవునియందలి ప్రేమచే వారు తమమనస్సులను బుద్ధి పూర్వకముగా దేవునికి వశపరచిననే తప్ప వారు మనస్సు యొక్క స్వాతంత్రియమును ఎన్నడు పొందనేరరు. నీవెక్కడికి బరుగెత్తినను నీకు చిత్తశాంతి గలుగదు. నీకు నియామకుడై యున్న ప్రభువుయొక్క పరిపాలనకు వినయ విధేయతలతో నీవు లోబడినపుడు మాత్రము నీవు చిత్తవిశ్రాంతిని పొంద గలుగుదువు. ఒకచోటు విడిచి మరియొకచోటును చేరదలచిన వారనేకులు తప్పుత్రోవలపడి చెడిపోయిరి. మనుష్యులందరు తమ యభిప్రాయముల ప్రకారము నడుచుకొను చుందురు. తమకిష్టమైన పనుల జేయుదురు. తమ మనస్సుకలసిన వా

యభిప్రాయములను తమ స్వంత యభిప్రాయముల కన్న ఎక్కువ యిష్టముతో ఆమోదించుచుందురు. కావున దేవుడు మనతో నున్నయెడల మన అభిప్రాయములను విడిచి ఆయన యభిప్రాయములనే చిత్తశాంతి కొరకు మనము ఎక్కువ యిష్టముతో పాటించు చుందుము. అన్ని సంగతులను పూర్తిగా నెరిగిన బుద్ధిమంతు డెవడు ? కనుక నీయభిప్రాయములయందు ఎక్కువ నమ్మకమును గలిగి యుండకుము. ఇతరులు చెప్పినసంగతులను ఎక్కువ ఇష్టముతో వినుచుండుము. నీయభిప్రాయము లే నీకు మంచివిగా కనిపించుచున్న యెడల దేవుని నిమిత్తము వాటినివిడిచిపెట్టి యితరుల అభిప్రాయములను వెంబడింపుము. అందువలన నీ యాత్మను ఎక్కువగా అభివృద్ధి చేసికొన్న వాడ వగుదువు. ఇతరులకు తాను ఆలోచన చెప్పుటకంటె ఇతరులఆలోచనను తాను వినుటయే క్షేమకరమని తరుచు నేను పెద్దల వలన వినుచుంటిని అందరి అభిప్రాయములు మంచివిగా నుండవచ్చును. అట్టిసంగతిలో తగినంత కారణమున్నప్పుడు కూడా ఇతరుల అభిప్రాయములకును ఆలోచనలకును ఇష్టపడకుండుట మూర్ఖత్వమునకును గర్వమునకును గురుతని తెలిసికొనుము.

---

## పదియవ ప్రకరణము.

## అధిక ప్రసంగవిసర్జనము.

ప్రపంచక వ్యాపారములచే తీరిక లేక బాధపడుచున్న జనసమూహమును వీలయినంత వరకు విడిచిపెట్టి దూరముగా

తోలగుము. మనమెంత నిష్కపటముగా మాట్లాడుచున్నను ప్రపంచక సంగతులు మనలను అభ్యాంతర పెట్టుచుండును. ఏల యనగా అందుచే గర్వముగలిగి వెంటనే పాడగుదుము. నేను ఎవరితోను మాట్లాడక తరుచు మౌనముతో నొంటరిగా నుండకోరెదను. మన ఆత్మకు బాధకలుగువరకు విడిచిపెట్టి యూరకుండక తరుచు మనమితరులతో మాటలాడుచు యిష్టముతో సంబాషణలలో ప్రవేశించు చుందుము. కష్టసుఖముల నొకరితో నొకరు చెప్పుకొని సంతోషించుటకును, అనేక ఆలోచనలతో విసికియున్న మనస్సునకు విశ్రాంతి గలిగించుకొనుటకు మనము తరుచుగా నొకరితో నొకరము సంభాషించుచుందుము. కావున మనకిష్టమైన సంగతులను గూర్చికాని, మన కపేక్షగలిగిన వస్తువులను గూర్చి గాని, లేక మనకు విచారకరముగానున్న సంగతులను గూర్చి కాని, మనము తరుచు మాట్లాడు కొనుచుందుము. అయ్యో! ఇది ఎంత అవివేకము. యీ పైయుపశమనముల వలన మనకేమి లాభము! ఇందు వలన మన అంతరంగమునకు గొప్పనష్టము కలుగుచున్నది. దేవుని వలన మనకు గలిగెడి ఉపశమనమునకు కూడా ఇది భంగమే. కావున మనము సోమరితనము చే లాభములేని ప్రసంగములయందు ప్రవేశించి కాలమును వ్యర్థముగా పాడు చేయకుండుటకు దేవుని ప్రార్థించు చుండుట మిగుల క్షేమకరము. మాట్లాడుట అవసరమని తోచినప్పుడు నీయాత్మ జీవముతో ప్రకాశింప దగిన సంగతులను మాత్రమే మాట్లాడుచుందుము. నీయాత్మాభివృద్ధిని పాటింపక చెడుపద్ధతి నన

రించి నీయిష్టమువచ్చినట్లు మాట్లాడితివేని అజాగ్రత సంభాష ణలలో ప్రవేశింప వలసి యుందువు. ఆత్మ విషయముల యందు ఒకరితో నొకరు తరుచు సంభాషించుట వలన పావ నత్వమునందు ఎక్కువగా అభివృద్ధి చెందుచుందురు. ఇందు చేతనే ఒకటే మనస్సు గలిగిన వారందరు దేవునియందేకమై యుండుటకు కారణము.

## పదునొకొండవ ప్రకరణము.

## చిత్తవిశ్రాంతి దేవుని యనుగ్రహమునందభివృద్ధి చెందుట.

మనకు సంబంధించని యితరుల మాటలలోను వ్యాపారములలోను మనము జోక్యము కలుగచేసికొనియెడల కావలసినంత చిత్తశాంతిని కలిగియుందుము. ఇతరుల వ్యాపారములలో ప్రవేశించువాడు చాలాకాలము ఏలాగున నెమ్మది గలిగి యుండకలడు? తనబాగు తానుచూచుకొనక పని కట్టుకొని యితరుల వ్యాపారములలో ప్రవేశింప బోవువాడు చిత్తశాంతిని ఎట్లు కలిగియుండ గలడు? కపటమెరుగని అమాయక జనులు నిజముగా అదృష్టవంతులు. ఎందుచేత ననగా వారు విస్తారముగా చిత్తశాంతిని అనుభవించు చుందురు. మహాత్ములందరు గొప్ప ఆలోచన పరులై యుండుటకును పరిపూర్ణులై యుండుటకును కారణమేమి? వారు ప్రపంచక సంబంధములైన కోరికల నన్నిటిని పూర్తిగా నశింపు చేసుకొనిరి. అందుచేవారు తమ మనస్సుయొక్క అంతర్యములో

దేవుని గట్టిగా నంటిపట్టుకొని యుండిరి. కావున వారు ఆత్మ విషయములను చక్కగా యోచింప గలిగి యుండిరి. మన మనస్సు కోరికలతో నిండియుండుటచే అశాశ్వతమైన పదార్థములను ఎక్కువగా నపేక్షించు చున్నాము. మనయందు నున్న ఒక దోషము నైనను పోగొట్టుకొన లేక పోవు చున్నాము. మనము దినదినము అభివృద్ధి జెందుటకు ప్రయత్నింప లేకపోవుచున్నాము. కనుక మనము అన్ని సంగతుల యందును మూఢులమైయున్నాము. ప్రపంచక విషయములను మనమెంతమాత్రము అంటక మనమనస్సును మనముపూర్తిగా చంపుకొన్న యెడల పరలోక విషయమును చవిచూడ గలుగుదుము. అప్పుడు మాత్రమే మనము పరలోకమునుగూర్చి యోచింపతగిన యనుభవమును గలిగియుందుము. పరలోకమునుగూర్చి మనల దెలిసికొనియ్యక అడ్డుకొనుచున్న సంగతి యొకటి కలదు. అది మన కోరికలను మోహమును విడిచి పెట్టలేకపోవుట. మనకు ముందు మహాత్ములు నడిచిన మార్గమును మనము ప్రవేశింపలేక పోవుచున్నాము. మనహృదయ శుద్ధిని పరీక్షించుటకు ఏదైన స్వల్పకష్టము తటస్థించిన యెడల మనము దానికి నిలువనేరక మనుష్యుల ఉపశమనమునకు శరణుచొచ్చు చున్నాము. మనము కూడా ధైర్యవంతులవలె ఆపరీక్షలయందు నిలువప్రయత్నించిన యెడల పరలోకము నుండి మనప్రభువు యొక్క సహాయమును పొందగలము. మనము జయించుటకు శోధనల నేర్పరచిన సర్వేశ్వరుడు తన అనుగ్రహమును నమ్మి వాటిని జయింప ప్రయత్నించిన వారికి

తోడుపడుటకు సిద్ధముగా నున్నాడు. మతము నందలి యభి వృద్ధి పైఆచారముల యందు మాత్రమే కనిపించు చున్న యెడల మన ఆత్మ జీవితము త్వరలో ముగియును. మనము చెట్టును పూర్తిగా చంపదలచి నపుడు దానిని వేళ్ళతో మొదటికి నరుకవలెను. అట్లనే కోరికలను పూర్తిగా నశింపు చేయుటకు మనస్సును మొదలంట చంపవలయును. అప్పుడు మాత్రమే మనకు తగినంత మనశ్శాంతి గలుగు చుండును. మనము సంవత్సరమునకు ఒక చెడుగుణమును పెరికివైచినను పరిపూర్ణమైన జీవితమునందు ఎక్కువగా నభివృద్ధి చెందిన వారమగుదుము. ఇందుకు వ్యతిరేకముగా మనము మతములో ప్రవేశించినప్పుడు ప్రారంభములో మనయందున్న ఆవేశము ను పరిశుద్ధత్వమును ఇపుడు క్రమక్రమముగా తగ్గిపోవుచున్నవి. మనము చాలా కాలమునుండి మతములో ప్రవేశించి యున్నను ప్రారంభములో మనము కలిగియున్న యోగ్యతలు కొంచెమైనను వృద్ధిపొందక క్షీణించు చున్నవి. ఎవరైనను ప్రారంభములో కలిగియున్న మతావేశములో కొంచెమైనను ఇప్పుడు కలిగి యున్న యెడల అదియొక గొప్పయోగ్యతగా యోచింప వలసియున్నది. ప్రారంభములో మన యెడల మనము కొంచెము కఠినముగా నున్నయెడల మనము అన్ని పనులను సులభముగాను సంతోషముగాను చేయగలుగు దుము. మనము అలవాటు పడియున్న దురభ్యాసములను విడి చిపెట్టుట కష్టముగా నుండును. మనము మన యిష్టమునకు వ్యతిరేకముగా నడుచుట అంతకంటె యెక్కువ కష్టముగా

నుండును. సులభమైన స్వల్పసంగతులలో నిన్ను నీవుజయించు కోలేనియెడల కఠినములైన గొప్పసంగతుల యందు నిన్ను నీవెప్పుడు జయించుకోగలవు? చెడుతలంపు మనస్సున పుట్టు చున్నపుడే అణచి పెట్టుము. దురభ్యాసములను దుర్గుణములను విడిచిపెట్టుము. లేనియెడల అవి క్రమక్రమముగా అతిశయించి నిన్ను గట్టిగా బంధించును. నీవుదేనిని చేయుటవలన ఎక్కువ చిత్తశాంతిని పొందగలుగుదువో ఇతరుల కది క్షేమకరముగా నుండునో దానిని నీవు తెలిసికోగలిగినయెడల ఆత్మ జీవితమునం దెక్కువగా అభివృద్ధి చెందుచున్నట్టు నేను యోచించెదను.

## పన్నెండవ ప్రకరణము.

## కష్టములవలన లాభములు.



కొన్ని సమయములయందు మనకు బాధలును కష్టము లును తటస్థించుచున్నవి. అట్లు మనకవి తటస్థించుట క్షేమకర మే. అందువలన మనశక్తి మనకు బోధపడి మనకీలోకము స్థిర ముగానట్లును, మనమీ ప్రపంచక పదార్థముల నాశింప కూడనట్టును మనము తెలిసికొనగలుగుదుము. మనముచక్కగా నడుచుకొనుచున్నప్పుడు కూడ కొన్ని సంగతులలో బాధల ననుభవింపవలసివచ్చును. అవమానములను తిరస్కారములను భరింప వలసియుందుము. అయినను అవి మనకు మంచివే. అం దువలన మనకు అణకువపట్టుబడి గర్వము నుండి మనల మన ము కాపాడుకొనగలుగుదుము. మనము మనుష్యులవలన అవ

దూషింపబడినప్పుడును తిరస్కరింపబడినప్పుడును మనస్సు దేవునివంకకు మరలుటకు నపేక్షించుచుండును. కనుక మను ష్యుడు నరుల యుపశమనమును ఎంతమాత్రము అపేక్షింపక దేవునియందుమాత్రమే పూర్తిగావిశ్రమింపగలుగును యోగ్య మైన మనుష్యుడు తనకు బాధకలిగినప్పుడును పరీక్షింపబడు చున్నప్పుడును దురాలోచనలతో ముట్టడింపబడినప్పుడును దేవుని యవసరమును కనిపెట్ట గలిగియుండును. అట్టిసమయము లయందాయన అనుగ్రహముతప్ప వానికి వేరుగతియేదియు లేదు. అతడు అనుభవించుచున్న దుస్థితికి మిగుల పరితాపపడి తన్ను రక్షింపవలసినదని దేవుని ప్రార్థించుచుండును. ఇంతే కాక వానికష్టము లతిశయించినప్పుడు ఈప్రపంచకములో బ్రతుకుట వానికి విసుగుగానుండి పరలోకమున క్రీస్తుతోనివ సించుటకు మరణముకొరకు నిరీక్షించుచుండును. పరిపూర్ణమైన రక్షణమును సంపూర్ణమైన చిత్తశాంతిని యీలోకములో ఎవ రును బొందలేరని అతడు నిశ్చయముగా తెలిసికొనగలిగియుం డును.

---

## పదమూడవప్రకరణము.

## మనోవికార (శోధన) నిరోధము.

మనమీ లోకమున బ్రతికియున్నంతవరకు కలతలను శోధనలను అనుభవింపక మానము. యోబువ్రాసినప్రకారము "ఈభూమిమీద నరునిజీవితము శోధనలతోకూడిన జీవితమై

యున్నది" (అపవాది) సైతాను ఎవరిని మ్రింగుదునాయని నిద్రలేక యెల్లప్పుడు తిరుగుచున్నాడు. కావున ప్రతివాడును వానిని కనిపెట్టి శోధనలు తటస్థించినప్పుడు వానివలన మోస పోక, జాగ్రతగానుండుటకు సర్వేశ్వరుని యెల్లప్పుడు ప్రార్థించుచుండవలెను. కొన్ని సమయములయందైనను ఈశోధనలచే ముట్టడింపబడని పరిశుద్ధహృదయములంతగా గనిపించవు. మనమైనను ఈశోధనలను బూర్తిగా తప్పించుకొలేకపోవుచున్నాము. శోధనలు స్వాభావికముగా మనకు బాధకరములైయున్నను నిజముగా అవి మనకు లాభకరములై యున్నవి. ఏలయనగా వాటివలన మనుష్యునకు వినయము పావనత్వము పట్టుబడుటయేగాక చక్కని తెలివితేటలు సైతముగలుగుచున్నవి. మహాత్ములందరు అనేకములైన శోధనలను కలతలను గడిచి వాటివలన గొప్పలాభమును బొందిరి. శోధనలను అనుభవింపలేనివారు చెడిపోయిరి. శోధనలు, కష్టములు లేని నిర్మలమైన ప్రదేశమేదియు లేదు. భూమిమీద బ్రతికియున్నంతవరకు శోధనలనుండి పూర్తిగా తప్పించుకొన్న మనుష్యుడెవ్వడు కనిపించడు. మనభ్రష్టస్వభావముయొక్క వారసత్వమునుబట్టి ఈశోధనలన్ని మనమనస్సులోనే పుట్టుచున్నవి. ఒకశోధన గతించిన వెంటనే మరియొక శోధన సంభవించుచున్నది. కనుక మన మెల్లప్పుడు ఏదోఒకటి అనుభవించవలసియున్నాము. ఎందుచేతననగా మనము సౌఖ్యమైన స్థితినుండి తొలగితిమి. అనేకులు ఈశోధనలను తప్పించుకొని పారిపోవుటకు ప్రయత్నించుచుండిరి. కాని వారాలాగుచేయుటచేత మరింత గట్టిగా వాటిలో

చిక్కుకొనుచుండిరి. వాటిని తప్పించుకొనుటకు పారిపోవుట తగిన సాధనముగాదు. ఓర్పు, సహనము, నిజమైన అడకువ యీమూడును అందుకు తగిన సాధనములు. వీటిమూలమున మన శత్రువులకంటెను మనమెక్కువ బలముగలవార మగుదుము. తన్ను శోధించుచున్న వస్తువులను విడిచి దూరముగా పారిపోవుటవలన వాని మనస్సున కది గొప్పలాభమును కలిగింపనేరదు. ఇంత మాత్రముచేత చెడుగు చేయగోరుచున్న మనస్సుయొక్క యుద్రేకము అణచిపెట్టబడనేరదు. ఇందువలన మనము తగినంత అభివృద్ధి నొందినవారముకాము. మనము ఆశోధనలనుండి దూరముగా పారిపోయినను అవి మరల తిరిగి వచ్చి మన మనస్సును పూర్వముకన్న ఎక్కువ సత్తువతో మరింత బాధించుచుండును. చాలాకాలము వాటిని భరించుట చేతను ఓరిమిచేతను దేవునియనుగ్రహమువలన వాటిని పూర్ణముగా జయింపగలము. అంతేకాని తొందరపడినంత మాత్రముచేతవాటిని పూర్ణముగా జయింపలేము. నీవు శోధింపబడుచున్న సమయములందు చక్కని యుపదేశముల గ్రహింపుము. ఇతరులెవరైన శోధింపబడుచున్నప్పుడు వారిని నీవు అసహ్యించుకొనకుము. నీవు ఉపశాంతిని బొందినట్లు వారికిగూడా ఉపశాంతిని గలిగింపుము. ఈచెడుగు పరిశోధనలు ఆరంభములో మనస్సు నిలకడలేకపోవుటచేతను దేవునియందు నమ్మకము లేక పోవుటచేతను సంభవించుచున్నవి. చుక్కానిలేనిపడవ కెరటములచేత ముందు వెనుకలకు కొట్టబడుచుండును. ఆవిధముగానే నిలకడలేని మనస్సు శోధనలవలన అనేక మార్గముల నాక

క్షింపబడుచుండును. అగ్ని ఇనుమును పరీక్షించునట్లు యోగ్యమైనమనుష్యుని శోధనలు పరీక్షించుచుండును. మనమెంతశక్తి గలిగియున్నామో మనమెరుగము. ఈశోధనలు మనశక్తిని మనకు జూపుచున్నవి. ఇదివరకు మనమెవరమో మనము కని పెట్టలేక పోవుచుంటిమి. ఈశోధనలు మనమెవరమైనదీ మనకు గనపరచుచున్నవి. శోధన ఆరంభమైన వెంటనే మనము దానినికనిపెట్టవలెను. దానిని మనస్సునందెంతమాత్రము ప్రవేశింపనీక వెంటనేతరిమి వేసినయెడల మనము దానిని సులభముగా జయింపగలుగుదుము. కనుకనే "వెంటనే అడ్డుపెట్టుము. వైద్యుడువచ్చునప్పటికి ఆలస్యమగును. అప్పుడు రోగము ముదిరిపోవును." అని ఒక బుద్ధిమంతుడు చెప్పెను.

మొట్టమొదట యీ శోధన వికారరూపమున చిన్న యోచనగా మనస్సునందు పుట్టుచున్నది. తరువాత అది పెద్ద బలమైన ఆలోచనగా మారుచున్నది. ఆపిమ్మట దానియందు ఉల్లాసము, దుర్మార్గము, సమాధానము పుట్టుచున్నవి. మనము ఆరంభములో అడ్డుపెట్టనియెడల ఈ దుష్టశత్రువు క్రమక్రమముగా పెరిగి మన మనస్సును పూర్తిగా ఆక్రమించుకొనును. ఈవిధముగా శత్రువును ఉపేక్షచేసి యూరకున్న కొలదిని మనసుయొక్క బలము తగ్గిపోవుచుండును. శత్రువుని బలము హెచ్చిపోవును.

కొందరు మతప్రవేశమునకు ప్రారంభములో శోధనల ననుభవించుచుందురు. మరికొందరు అంతమున అనుభవించుచుందురు. ఇక కొందరు తాము బ్రతికియున్నంత కాలము

ఒకటే విధముగా శోధనల ననుభవించుచుందురు. దేవుని నియామక ప్రకారము తాము కలిగియున్న జ్ఞానమును బట్టియు న్యాయ బుద్ధినిబట్టియు కొందరు యీ శోధనలచే స్వల్పముగా బరీక్షింపబడుచుందురు. దేవుడు మనుష్యులకు వారివారి యోగ్యతలను బట్టియు అర్హతను బట్టియు తాను నిర్ణయించినవారికి రక్షణపొంద తగిన సాధనములను సందర్భపరుచుచున్నాడు. కనుక మనము శోధింప బడుచున్నప్పుడు ఎంత మాత్రము నిరాశజెందక యీకలవరములోన సర్వవిధముల మనకు తోడుబడి మనల రక్షించుటకు ధృఢమైన భక్తివిశ్వాసములతో మరింత యెక్కువగా దేవుని ప్రార్థించుచుండవలెను. ‹‹ మీరు సహింపగలుగుటకు ఆయన శోధనలతో కూడా తప్పించుకొను మార్గము కలుగజేసియున్నాడు.'' అని పౌలు చెప్పియున్నాడు. కనుక మనము మనకు తటస్థించుచున్న ప్రతి శోధనయందును పరీక్షయందును అణకువ గలిగి మన యాత్మను దేవునికి వశపరచితిమేని ఆయన మనలరక్షించును. దీనులైయున్న వారిని సర్వేశ్వరుడు తప్పక ఆనందింపజేయును. ఈ శోధనల మూలమున మనుష్యుని ఆత్మాభివృద్ధి పరీక్షింపబడుచున్నది. అందువలన ఆతడు పొందవలసియున్న బహుమానము సైతము ఎక్కువగుచున్నది. అతని యోగ్యతలు బయలుపడి యితరుల జ్ఞానాభివృద్ధికి సైతము సాధనమగుచున్నది. శోధనలు పరీక్షలు లేనప్పుడు భక్తివిశ్వాసములు గలిగి యోగ్యుడైయుండుట ఘనకార్యము కాదు. కాని కష్టసమయములయందు వాటిని సహించి దేవునియందు భక్తి

విశ్వాసములు కలిగియుండుట గొప్పకార్యము. అందువలన మనుష్యుడు మతమునందెక్కువ యభివృద్ధి చెందియున్నట్టు స్పష్టముగా గనిపించు చుండును. గొప్పశోధలనుండి తమ్ము తాను కాపాడుకొనగలిగిన కొందరు తరుచు ప్రతిదినము తటస్థించుచున్న స్వల్పసంగతులకు నిలువలేక పోవుచుండిరి. కనుక వారు చిన్నసంగతులలో కూడా తమరు బలహీనులై యున్నట్టు కనిపెట్టి గొప్పసంగతులయందు తమరు ఘనులు కానట్టు తెలిసికొనగలిగి యుండిరి.

---

## పదునాలుగవ ప్రకరణము.

## ఆలోచనయందు వేగిరపాటును విడిచిపెట్టుట.



మీకన్నులను మీవంకకు త్రిప్పుకొనుము. ఇతరుల కార్యములమీద తీర్పుదీర్చక విడిచిపెట్టుము. ఇతరులకు తీర్పు చెప్పుటలో మనుష్యుడు ఎంతమాత్రము లాభము పొందలేడు. ఆతడు తీర్పుచెప్పుటలో తప్పుచేసి పాపము నొందుచుండును. తన్నుతాను విమర్శించుకొనుట వలన చాలా లాభము పొందగలడు. మనమేసంగతినైన విమర్శించునప్పుడును మనకుదోచినట్లెల్ల విచారించుదుము. మనమనస్సున రహస్యముగా దాగియున్న కొన్ని సంగతులనుబట్టి మనముచేయుచున్న న్యాయవిచారణ సులభముగా భ్రష్టీకరించుచుండును. మనముచేయుచున్న అన్నికార్యములయందును దేవుని ప్రీతికొరకు మనము పరిశుద్ధ హృదయులమైయున్న యెడల మన అభిప్రాయము

లకు విరుద్ధము సంభవించినను మనము సులభముగా కలత జెందము. ఒక సంగతియొక్క నిజమును నిశ్చయించుటలో పక్షపాతము అసూయత మొదలయిన దుర్గుణములు కొన్ని స్వతస్సిద్ధముగా మనస్సునందు పుట్టుటవలనగాని లేక యితరులు చెప్పినమాటలను వినుటవలన గాని మనము తప్పుదారిని పడు చుందుము. ఏదైనా యొక కార్యమును చేయునప్పుడు అనే కులు రహస్యముగా తమలాభమును చూచుకొనుచుందురు. కాని వారాసంగతిని తెలిసికోలేక పోవుచున్నారు. వారు కార్యములు తమయిష్టానుసారముగా జరుగుచున్నంత వరకు చిత్తశాంతిని కలిగియుందురు. కాని అవి వారికి విరోధముగా జరిగినప్పుడు శీఘ్రములో కలతజెంది కృశించుచుందురు. భావములును అభిప్రాయములును వేరువేరుగా నుండుటచేత స్నేహితులయందును, దేశస్థులయందును, మతస్థులయందును దైవారాధకులయందును కలతలును విరోధములును సంభవిం చుచున్నవి. పూర్వమునుండియు అలవాటు పడియున్న అభ్యా సమును విడిచిపెట్టుట బహుకష్టము. తన అభిప్రాయమునకు విరోధించి యిష్టముతో నడువగలిగిన వాడెవడును లేడు. యేసుక్రీస్తునకు సన్నులోబడి చెడి శక్తికన్న నీబుద్ధిమీదను ఆలో చనశక్తి మీదను ప్రయత్నముమీదను నీవు ఎక్కువగా ఆధారపడియున్న యెడల నీయాత్మను అభివృద్ధి చేసుకొను టకు చాలా కాలము పట్టును. ఏలయనగా మనమందరము ఆయనకు విధేయులమై యుండవలెనని దేవుడు మనల కోరు చున్నాడు. మన హృదయము ఆయనను పూర్తిగా ప్రేమిం

చిన యెడల మనుష్యుడు సాధారణముగా కలిగియున్న జ్ఞానముయొక్క హద్దును మనము దాటగలుగుదుము. అనగా సామాన్యముగా మనుష్యుడు కలిగియున్న జ్ఞానముకంటె మనమెక్కువజ్ఞానమును గలిగియుందుము.

---

## పదునైదవ ప్రకరణము.

## కర్మకార్యములు.

మనుష్యునిమీాద ప్రేమచేతగాని మరియేయితర సంగతిని బట్టిగాని చెడ్డకార్యమును మన మెన్నడు చేయరాదు. ఆకార్యము ఒకానొకనికి అవసరమై యుండవచ్చును. అది వానికి లాభముగా నుండుటచే మంచికార్యముగా కనిపించవచ్చును. అయినను ఒకనికి లాభము కలుగుచున్నంత మాత్రము చేత చెడుకార్యము నెన్నడును చేయరాదు. ఆకార్యము వానికి నీవు చేయనందుకు నీకు విచారము కలిగినయెడల ఆ మంచి వానికి న్యాయమైన మరియొక మార్గమున జేయుము. అందువలన నీవు మంచికార్యమునుచేయక విడిచిపెట్టినవాడవు కావు. నీవెక్కువమంచికార్యమును జేసినవాడవవుదువు. దానధర్మములనుచేయక పై కార్యము లెన్ని జేసినను లాభములేదు. ధర్మబుద్ధితో చేసిన దానము లోకమునకు స్వల్పముగానున్నట్టు కనిపించుచున్నను అది గొప్ప ఫలమును గలిగించును. దేవుడు మనుష్యు డెంతదానము చేసినది చూడడు ఎంత ప్రేమతో దానముచేసినది కనిపెట్టి చూచుచుండును. దేవుడు దానము

చేయబడిన పదార్థముకంటె దాతయొక్క హృదయశుద్ధిని యెక్కువగా చూచుచుండును. పాత్రతయెరిగి తనకు శక్తి గలిగినంతవరకు దానముచేయువాడును పరిశుద్ధమైన ప్రేమతో దానము చేయువాడును తనలాభమును పాటింపక లోకము యొక్క మేలుకొరకు దానము చేయువాడును మహాదాతలని చెప్పబడుదురు. నిజముగా తమ లాభము నిమిత్తము చేయ బడుచున్న అనేక కార్యములు ధర్మబుద్ధితో చేయబడుచున్నట్లు కనిపించి దానములని భ్రమింప జేయుచున్నవి. ఎందుచేత ననగా అవి పేరుకీర్తుల నిమిత్తమును తమ లాభము నిమిత్త మును ఆనందము నిమిత్తమును చేయబడుచున్నవి. నిజమైన దాత తన నిమిత్తమెంత మాత్రము యోచింపడు. తాను జేయుచున్న అన్ని కార్యముల యందును దేవుని యానందింప జేయగోరుచుండును. ఆతని కెవరియందును అసూయత లేదు. ఎందుచేతననగా ఆతని మనస్సునందు పక్షాపక్షములు లేవు. తన సుఖమున కెంతమాత్రమును సంతోషింపడు. ఆతడు అన్నిటికంటెను ఎక్కువగా దేవునియం దానందించి సుఖపడు టకు కోరుచుండును. ఆతడు మంచిని ఎంతమాత్రము నరునకు ఆరోపించడు. మహాత్ములందరు ఎవనియందు తాము పొంద వలసియున్న ఫలమును కనిపెట్టి యుండిరో భక్తులందరు ఎవని యందు ఎల్లప్పుడు విశ్రమించుచుండిరో సర్వ విషయములు ఎవనియందు పుట్టుచున్నవో అట్టి సర్వేశ్వరునకు సర్వమును అతడు ఆరోపించుచుండును. నిజముగా రవంతధర్మబుద్ధిగలవాడు ప్రపంచక సంగతులన్నియు వ్యర్థములని తలచి విడిచిపెట్టును.

## ప ది యా ర వ ప్ర క ర ణ ము .

## ఇతరుల లోపములను సహానముతో భరించుట.

తనయందున్న లోపములను గాని ఇతరుల యందున్న లోపములనుగాని తాను సవరణచేసికొన లేనప్పుడు దేవుడు వాటిని సవరణచేయువరకు ఓరిమితో వాటినిభరింప నేర్చుకొన వలెను. ఆలాభరింప నేర్చుకొనుట నీకు చాలా మంచిది. అందువలన నీయోరిమి చక్కగా లోకమునకు కనిపించుచుం డును. ఓరిమి లేనపుడు నీవెంత మంచి కార్యము చేసినను విలువ యుండదు. జనులు దానిని మెచ్చుకొనరు. నీకటువంటి బాధకలిగినపుడు వాటినిశాంతముతో భరింపగలుగుటకు నీకు తోడుపడి రక్షింపవలసినదని సర్వేశ్వరుని వేడుకొనుము. నీవు యెవరినైనను ఒకటి రెండు మారులు మందలించి నప్పుడు వారు వినక పోయిన యెడల వారితో ద్వేషింపక దేవుని అభిప్రాయ ప్రకారము జరుగగలందులకును ఆయన నామము ఆయన దాసులందరి వలనను పరిశుద్ధపరచ బడుటకును దాని నంతయు అయనకు విడిచిపెట్టుము. ఏలననగా చెడ్డనుమంచిగా ఏలాగున మార్చవలయునో ఆయనకు తెలుసును. ఇతరుల లోపములు దోషములు ఎటువంటివైనను వాటిని ఓర్పుతో భరింప నేర్చుకొనుము. ఏలననగా నీయందుకూడా అటు వంటి దోషములును లోపములును విస్తారముగానున్నవి. వాటి నన్నిటిని యితరులు భరింపవలసి యున్నారు. ఇతరులేలాగున ఉండవలెనని నీవు కోరుదువో ఆలానీవుండలేక పోవుచుంటివి.

ఇతరులు అన్ని సంగతులలోను నీయిష్టప్రకారముండగలరని నీవే
లాగున అనుకొనెదవు ? ఇతరులు కఠినముగా సవరణచేయబడ
వలెనని నీవుకోరుదువు. నీవు సవరణచేయబడుటకు నీవుసమ్మ
తింపవు. ఇతరులెవరైనా చాలా స్వేచ్ఛగలిగి యున్న యెడల
అదినీకు హితవుగా నుండదు. మనము కోరినదానిని ఎవరైనా
నిరాకరించిన యెడల అదిమనకు ప్రాణసంకటముగా నుండును.
ఇతరులందరు కఠినమైన చట్టములకు బద్ధులుగా నుండవలెనని
కోరుదుము. కాని మనమట్టు బద్ధులమగుటకు సమ్మతింపము.
మనతోడి మానవుని ఎంతవరకు మనతో సమానముగా జూ
చుచున్నామో ఇందు వలన గనిపించు చున్నది. మనుష్యు
లందరు పరిపూర్ణులైన యెడల మనతోడి మానవుని నుండి
దేవుని కొరకు మనము భరింపవలసిన దేదియుండును ? ఒకని
భారము నొకరు భరింపవలసినదని దేవుడేమనకు విధించెను.
మనుష్యులలో తప్పులేని వాడెవ్వడును లేడు. భారము లేని
వాడెవ్వడును లేడు. పూర్ణముగా తెలిసిన వాడెవ్వడును లేడు.
సంపూర్ణ బుద్ధిమంతుడెవ్వడూ లేడు. గనుక మనము ఒకరి
నొకరము భరింపవలెను. ఒకరి కొకరము బోధించుకోవలెను.
బుద్ధి చెప్పుకోవలెను. మందలించుకో వలెను. కష్టసమయ
ములు మనుష్యుడెంత మంచివాడైనది ఎంత బలవంతుడైనది
పరీక్షించు చుండును. కష్టములు బాధలు మనుష్యునికి దుర్బ
లత్వమును గలిగింపవు. కాని అవిమనుష్యుని యోగ్యతా
యోగ్యతలను లోకమునకు జూపుచుండును.

---

# పదిఏడవ ప్రకరణము.

## ఏకాంతజీవితము

ఇతరులతో ఐకమత్యముగాను నెమ్మదిగాను సాత్వికమైన మనస్సుతోను ఉండదలచిన యెడల అనేక సంగతులలో నీయిష్టమును నీవు విడిచిపెట్ట నేర్చుకోవలెను. మత సంఘములలోనుండి బాధలేకుండా అందరితోను మాట్లాడగలుగుటయు అంత్యకాలము వరకు విశ్వాసముతో నుండుటయు తేలిక సంగతులు కావు. ఈ విధముగా బ్రతికి సుఖముగా చనిపోయినవారు చాలాధన్యులు. మీరుఆత్మజీవితమున చక్కగా అభివృద్ధి జెందదలచిన యెడల ఈ లోకములో నీవు పరదేశివిగాను యాత్రికుడవుగాను ఉన్నట్లు భావించుకొనుము. మత జీవితము నాచరింపదలచిన యెడల ఈలోకములో క్రీస్తుకొరకు పిచ్చివానివలె సంచరించుము. తలలు బోడిగా జేసుకొన్నంత మాత్రముచేత సన్యాసి కానేరడు. నడతను మార్చుకొనుటయు కోరికల పూర్తిగా విడిచి పెట్టుటయు నిజముగా మతములో జీవించుచున్న వాని లక్షణములు. ప్రతిసంగతిలోను దేవుని మహిమ గనిపెట్ట లేనివాడును ఆత్మరక్షణమును కనిపెట్టలేనివాడును వ్యర్థుడై అన్ని విధముల బాధపడుచుండును. అందరికి విధేయుడై యుండుటకును అందరికంటె తగ్గియుండుటకును ప్రయత్నింపని వాడు చాలా కాలము చిత్తశాంతి ననుభవింపలేడు. నీవీలోకములోనికి పరిచారముచేయుటకేవచ్చితివి. కాని ఒకరిపై ప్రభుత్వము చేయు

టకు రాలేదు. నీవు కష్టపడుటకును పాటుపడుటకును పుట్టింప బడితివి. అంతియేకాని లాభములేని మాటలతో కాలము గడుపుటకును, సోమరివిగా నుండుటకునుగాదు. నిప్పుకొలిమి లో బంగారము పరీక్షింపబడుచున్నట్టు యీ భూలోకములో మనుష్యులు పరీక్షింప బడుచుందురు. దేవునిమీద ప్రేమచే ఎవడు బుద్ధిపూర్వకముగా తన్ను తా నణగ ద్రొక్కుకొని యుండునో ఆతడుతప్ప యితరు లెవ్వరును ఆపరీక్షలో నిలువ నేరరు.

---

## పదునెనిమిదవ ప్రకరణము.

## పెద్దల నిదర్శనము.

పరమపావనులైన పెద్దలనిదర్శనమును కనువిచ్చి చూడుము. వారియందు మత విశ్వాసమును పరిపూర్ణత్వమును అపరిమితముగా ప్రకాశించుచున్నవి. వారియోగ్యతముందు మనయోగ్యత మహాసముద్రముముందు నీటిబొట్టువలె కనిపించుచున్నది. మనజీవితము వారిజీవితములతో సరిపోల్చి చూచునప్పుడు మనజీవితమెంత ? మహాత్ములును క్రీస్తుయొక్క మిత్రులును ఆకలియందును దప్పికయందును దరిద్రమునందును కష్టమునందును బాధలయందును ఉపవాసములయందును ధ్యానమునందును ప్రార్థనలయందును విచారములయందును తిరస్కారములయందును దేవుని యెంత నిదానముతో సేవించియుండిరి! క్రీస్తునను సరించుటకు వారందరు ఎన్నికష్టముల ననుభవించిరి !

వారుపడిన బాధ లెంత ఘోరము లైనవి! వారు శాశ్వతమైన పరలోకజీవితము నాశించి యుండుటచే ఇహలోక జీవితమును నిరశింప గలిగిరి. ఆహా! వారిజీవితము లెంత స్వచ్ఛము లైనవి! వారుఇరుకుత్రోవను పడినప్పుడు ఎంతకచ్చితమైన వైరాగ్యమును గలిగియుండిరి! వారిని శోధించిన శోధనలు ఎంతకఠినము లైనవి! ఎంత దీర్ఘము లైనవి? ఆత్మశత్రువులచే వారెన్నిమారులు ముట్టడింపబడిరి! ఆశత్రువులను జయించుటకు వారెంతగాఢముగా దేవుని ప్రార్థించిరి! వారు చేసియున్న యుపవాసము లెంతకఠినము లైనవి! ఆత్మజీవితమునందు అభివృద్ధిచెందుటకు వారు చేసియున్న సాధనము లెంత గాఢమైనవి! వారుచేసియున్న యుద్ధములు ఎంత తీక్ష్ణము లైనవి! దేవుని మహిమను కని పెట్టుటకు వారుకలిగియున్న జ్ఞాననేత్రము ఎంతపరిశుద్ధమైనది! వారుపగలంతయు పాటుపడి రాత్రిఅంతయు దేవుని ప్రార్థించుటకు వినియోగించి యుండిరి. పాటుపడుచున్న సమయముల యందైనను దేవుని చింతనమును విడిచియుండుట లేదు. వారు తమ జీవితకాలములో ఒక నిమిషమైనా పాడుచెయ్యక చక్కగా ఉపయోగపరచియుండిరి. వారు దేవునియందు గడిపియున్న విస్తారమైనకాలము నిమిషముకన్నను తక్కువగానున్నట్టు వారికి కనిపించియుండెను. దేవుని ప్రార్థనలయందు వారనుభవించిన మాధుర్యరసముచే శరీరధర్మములనుకూడ మరచిపోయియుండిరి. వారుధనమును, గౌరవమును, మర్యాదను స్నేహితులు బంధువులు మొదలయిన వాటినన్నిటిని విడిచియుండిరి. ఎందుచేతననగా వారీప్రపంచక సంబంధమును ఎంత

మాత్రము కోరుటలేదు. వారు జీవించుటకవసరములైన వస్తువులను సైతము అపేక్షించలేదు. వారుశరీరమును పోషించుకొనవలసివచ్చినందుకు మిగుల వ్యసనపడిరి. వారు ప్రపంచక సంగతులయందు చాలా బీదలైయున్నను దేవుని యనుగ్రహమునందును యోగ్యత యందును మిగుల భాగ్యవంతులైయుండిరి. వారుపైకిదరిద్రులైయున్నను అంతరంగమున దేవునియనుగ్రహముతోను ఉపశాంతితోను నిండియుండిరి. వారీప్రపంచకమునకు పరదేశులైయున్నను దేవునికి దగ్గరవారుగాను పరమమిత్రులుగాను ఉండిరి. వారిదృష్టికి వారు వట్టివ్యర్థులుగా గనిపించి యుండిరి. ప్రపంచకముచే నిరశింపబడిరి. కాని వారు దేవుని దృష్టికి చాలాప్రియమైన వారుగానుండిరి.

అణకువయందు వారు స్థిరముగా నిలిచి యుండిరి. పరమ విధేయతతో జీవించిరి. ధర్మమునందును ఓరిమినందును వారు చక్కగా నడిచిరి. వారు ప్రతిదినము చక్కగా అభివృద్ధి నొంది పూర్ణముగా దేవుని యనుగ్రహమును సంపాదించుకొనిరి. మతమునందు విశ్వాసముగల వారందరికిని నిదర్శనముగా జూపబడు చుండిరి. మనశ్రద్ధను పాడు చేయుచున్న అనేకజనులకన్న మతమునందు మనకు గొప్ప ఆవేశమును గలిగించుటకు వారు ఎక్కువశక్తి గలిగియుండిరి. ప్రారంభములో మాతసంఘము లేర్పడి నపుడు మతజనులు గలిగియున్న పట్టుదల ఎంత బలమైనది.

ప్రార్థనలయందు వారు గలిగియున్న భక్తివిశ్వాసము లెంత గాఢమైనవి! యోగ్యతకొరకు వారాశించియున్న ఆశ

ఎంత గొప్పది. వారు పొందియున్న శిక్ష ఎంత కఠిన మైనది. తమకన్న గొప్పవారిని వారు ఎంత అణకువతో గౌరవించిరి. వారు నడిచిన అడుగుల జాడ లింకను కనుపించు చున్నవి. వారి పావనత్వమును పరిపూర్ణత్వమును పూర్ణముగా వెల్లడి చేయుచున్నవి. వారు ధైర్య సాహసములతో బోరాడి యీ ప్రపంచక మంతయు తమ పాదముల క్రింద దిగద్రొక్కిరి. వారిపుడు మహాత్ములని చెప్పఁబడుచుండిరి. వారుపాపము నంటక తప్పించుకొ గలిగిరి. వారిజీవితములో వారు పొంద వలసి యున్న గతిని వారు ఓర్పుతో అనుభవించిరి. మాంద్యము అశ్రద్ధ మన మనస్సునాశ్రయించి యున్నవి. ఆరంభము లో మనముగలిగియున్న పట్టుదల క్రమక్రమముగా తగ్గితుదకు మత జీవితమునందు విసుగు జెందుచుంటిమి. ఆత్మజీవితము అభివృద్ధి జెందవలెనన్న ఆసక్తినీయందు మరుగుపడియుండని యెడల పరమభక్తుల జీవితమును కనిపెట్టి యానందించుటకు అవకాశము గలిగి యుండును.

---

## పందొమ్మిదవ ప్రకరణము.

### మతానుష్ఠానము.

మతమునం దావేశముగల మంచిమనుష్యుని జీవితము పైకి అందరికియేవిధముగా గనుపించుచుండునో మనస్సునందు కూడా అదేప్రకారముగా గనిపించుటకు సర్వయోగ్యతలు గలిగి ప్రకాశించుచుండవలెను. పైకి కనిపించుచున్నదాని

కంటె మనస్సునందు ఎక్కువ యోగ్యతను గలిగి యుండవలె ననుట యదార్థమే. ఏలయనగా దేవుడు మనలను బరిశీలించి చూచుచున్నాడు. కనుక మన మెక్కడనున్నను ఆయనను మహిమపరుచుటకును ఆయన దృష్టిలో ఆయన దూతల వలె నీతిగలిగి యదార్థముగా ప్రవర్తించుటకును మనము బద్ధుల మై యున్నాము. అదియే మన మత ప్రవేశమునకు ప్రారంభ దినమైనట్లు మన పట్టుదలకు మరింత బలము గలుగుటకు ప్రతి నిత్యము "ఓ ప్రభువా యోగ్యమైన యీనా ప్రయత్నము నందును పావనమైన నీ సేవయందును నాకు తోడుపడుము. నేనింతవరకు చేసినదంతయు సరిగా నుండకపోయినను ఈ దినముననైన నేను దానిని పూర్తిగా ప్రారంభింపగలుగుటకు నన్ననుగ్రహింపుము." అని దేవుని ప్రార్థించు చుందుము. మన జయము మన మనస్సుయొక్క బలముమీద ఆధారపడి యున్నది. మనము నిజముగా అభివృద్ధి పొందదలచిన యెడల ఎక్కువశ్రద్ధను మనము వినియోగింపవలయును. దృఢనిశ్చయ ముతో ప్రయత్నించినవారే తమ ప్రయత్నముయొక్క ఫల మును పొందలేక తప్పిపోవుచుండగా, తగినంత నిశ్చయముతో బ్రయత్నింపనివారును, అప్పుడప్పుడు అరుదుగా బ్రయత్నించు వారును ఏమికావలసి యుందురు? వారిగతి యేమగును? మనము మన ప్రయత్నమును విడిచి పెట్టుటకు అనేక మార్గ ములు గలవు. జీవసాధనలలో మనము ఏమాత్రము లోపము జరిగించినను అది మన ఆత్మకు తగినంత కష్టము చేసితీరును. యోగ్యులయొక్క ప్రయత్నములు వారి తెలివితేటల మీద

ఆధారపడియుండవు. అవి దేవుని యనుగ్రహము మీదనే ఆధారపడియున్నవి. వారేప్రయత్నము చేసినను ఆయన అనుగ్రహమునే నమ్మియుందురు. ఏలయనగా మనుష్యుడు ఒకటి తలచితే దేవుడు మరియొకటి చేయును. మనుష్యుని త్రోవ మనుష్యునియందు లేదు.

మనము విధాయక ధర్మమును నెరవేర్చవలసి వచ్చినప్పుడుగాని లేక పొరుగుమనుష్యునకు సహాయముచేయవలసి వచ్చినప్పుడుగాని మనము వాడుకగా జేయుచున్న ఆత్మసాధనములలో ఏదైనా కొంత దిగబెట్టినయెడల ఆలోపమును ఆవల మనము కూడదీసుకొనగలము. ఉపేక్షచేతను, యిష్టములేకను విడిచిపెట్టిన యెడల మనకు పాపము గలుగును. అందు వలన మనకు హాని కూడ సంభవించును. మనము చేయగలిగిన దానిని ఎంత బాగుగా జేసినను దానియందు లోపముండక మానదు. అయినను నిష్కర్షగా జేయుటకు మనము కొన్ని నియమములను ఏర్పాటుచుకోవలెను. ముఖ్యముగా మనలో అందరూ సామాన్యముగా తప్పిపోవుచున్న నియమములను మరింత కట్టుదిట్టముగా నెరవేర్చుటకు నిశ్చయపర్చుకొనవలెను. మనము ప్రతిదినము మన అంతరంగమును బహిరంగమును శ్రద్ధతో పరీక్షించుకొనుచుండవలెను. ఏలయనగా యీరెండును ఆత్మాభివృద్ధికి ముఖ్యమైనవే. ఈసంగతిని నీవు యెడతెగకుండా ఎల్లప్పుడు జ్ఞాపకముంచుకో లేనియెడల ఉదయమునగాని లేక సాయంత్రమునగాని దినమునకొక మారైనను జ్ఞాపకము చేసుకొనుము. నీవు చేయదలచిన పనులను ఉదయమున నిశ్చ

యపరుచుకొనుము. నీవాలాగు చేసినది లేనిది నిన్ను నీవు ప్రతి రాత్రి పరీక్షించుకొనుము. ఆదినములో నీవు ఆలోచించిన ఆలోచనలను నీవాడినమాటలను నీవు చేసినపనులను జ్ఞాపకముచేసుకొనుము. ఈపనులలో నీహొరుగు మనుష్యుని నీవు తరుచు నొప్పించియున్నట్లును దేవునికి కోపము తెప్పించినట్లును నీవు తెలుసుకొనగలవు. (అపవాది) సాతాను చేయుచున్న కుతంత్రములను జయించుటకు నడుము బిగించుకొని మగతనముతో నిలిచియుండుము. నీమనస్సును వేధించు చున్న కోరికలను అణచిపెట్టుము. అప్పుడు నీయింద్రియ వికారములను పూర్ణముగా జయింపగలవు. ఒకప్పుడును పాలుమాలియుండకుము. వ్రాయుటగాని చదువుటగాని ప్రార్థించుటగాని ధ్యానించుటగాని లేక లోకమునకు లాభకరమైన మరియొక యితరపనినిగాని చేయుచుండుము. మంచి తెలివితేటలతో శరీరసాధకములను చేయుచుండుము. అవి అందరి చేతను ఒకటేవిధముగా అభ్యసింపబడవు. అందరికి సామాన్యములుగా నుండని సాధనములను అందరికి కనిపించునట్లు బహిరంగముగా చేయకుము. అట్టి సాధనలను ఇంటికడ ఒంటరిగా మరింతనెమ్మదితో చేయగలవు. నీవు ప్రత్యేకించి ఏర్పరుచుకొనియున్న విధులను నెరవేర్చవలెనని తొందరపడి అందరూ సామాన్యముగా జేయుచున్న మతకృత్యములను ఉపేక్షించి విడిచిపెట్టకుము.

సామాన్యమైన మతకృత్యములను యథావిధిగా పూర్తి చేసిన పిదప సావకాశమున్న యెడల నీవు నీయిష్టము ననుసరించి ప్రత్యేకించి నీవుఏర్పరుచుకొనినవిధులను నెరవేర్చుము.

ప్రార్థనలయొక్క పద్ధతులు అందరికి ఒకటేవిధముగా నుండవు. ఒక్కొక్కరికి ఒక్కొక విధమైన ప్రార్థన యనుకూలముగా నుండును. ఒక్కొక సమయమునందు ఒక్కొక విధమైన ప్రారన మనకవసరమై యుండును. కొన్ని పార్థనలు పండుగ దినములయందు మనఆత్మను ఆనందింప జేయగలిగి యుండును. కొన్నియితర రోజులలో మనల సంతుష్టిపరుచును శోధన సమయములయందు కొన్ని విధములైన ప్రార్థనలు మనకు అవసరములై యుండును. నెమ్మదిగానున్న దినములలో మనము మరికొన్ని విధములైన ప్రార్థనలను అక్కర గలిగి యుందుము. మనము విచారముచే బాధపడు చున్నప్పుడు కొన్ని అంశములను గూర్చి మాత్రమే ప్రార్థించుదుము మనము దేవునియం దానందించు నప్పుడు మనప్రార్థనయందు మరికొన్ని సంగతులను చెప్పుకొందుము. ముఖ్యమైన పండుగ దినములలో ప్రార్థనయొక్క మంచిపద్ధతులను నూతన పరచ వలసియుండును. మరియు మహాత్ములందరు ప్రార్థింపగలిగినట్లు మనము కూడా ప్రార్థింప శక్తిగలిగియుండుటకు దేవుని వేడు కొనవలెను. ఈలోకమును విడిచి పరలోకములో మహా పండుగ ననుభవింప బోవుచున్న యాత్రికునివలె నొక పండుగ దినము మొదలు మరియొక పండుగ దినమువరకు దేవుని భక్తి విశ్వాసములతో పార్థించుటకు ప్రారంభింప వలెను. అట్టి పావన సమయములందు మనము జాగ్రతతో ప్రార్థనావిధులను కచ్చితముగా భక్తితో నెరవేర్చ వలయును. అట్లు నెరవేర్చుచున్నప్పుడు దాని ఫలమును అతి శీఘ్రములో పొందబోవు చున్నామని గట్టిగా నమ్మియుండవలెను.

మన ప్రయాణము నిలిచి పోయిన యెడల తగినంత కట్టుదిట్టముగా మనల మనము తయారు చేసుకొన లేదనియు మనయెడల ప్రత్యక్షము కానున్న మహిమముందు మనమిప్పుడు పడియున్న శ్రమఎన్నదగినది కాదనియు కనుక మనమింకను దాని కర్హులమైయుండ లేదనియు భావించు కొనుము. కావున మన ప్రయాణమున కింతకన్న ఎక్కువ కచ్చితముగ తయారై యుండుటకు మనము ప్రయత్నింపవలెను.

"ఎవని ప్రభువు వచ్చి వాడుఆలాగు చేయుచుండుట కనుగొనునో ఆదాసుడు ధన్యుడు. ఆతడు తనకు గలిగిన దంతటిమీదను వానినుంచునని మీతో నిజముగా చెప్పుచున్నాను" అని లూకా చెప్పుచున్నాడు.

## ఇరువదియవ ప్రకరణము.

## మౌనమును ఏకాంతజీవితమును ప్రేమించుట.

నిన్ను నీవు విచారించుటకు తగినసమయము కనిపెట్టుము. నీకు దేవుడు అనుగ్రహముతో దయచేసియున్న మేళ్లను చక్కగా యోచింపుము. విచిత్రమైన సంగతులను విడిచి పెట్టుము. నీమనస్సునకు పశ్చాత్తాపమును గలిగించెడి పుస్తకములను మాత్రమే చదువుము. పనికిమాలిన యాలోచనల పుట్టించెడి గ్రంథములను జదువకుము. వ్యర్థముగా మాటలాడుటయు సోమరితనముతో ప్రొద్దుపుచ్చుటయు విచిత్రములైన క్రొత్తసంగతులను లోకవృత్తాంతములను అపేక్షతో

వినగోరుటయు మొదలైన లాభములేని సంగతులను విడిచి పెట్టుటవలన అనేకములైన మంచిసంగతులను తగినంత సావకాశముతో యోచింప గలుగుటకు నీవు కావలసినంత తీరిక గలిగియుందువు. గొప్ప మహాత్ములందరు దేవునితో రహస్యముగా నుండగోరినప్పుడెల్ల వీలైనంతవరకు జనసమర్ధమును విడిచిపెట్టిరి. "నేను మనుష్యుల మధ్యనున్నప్పుడు అంతకు ముందుకన్న కొద్దిమనుష్యుడనై వారినుండి తిరిగివచ్చితిని." అని ఒకడు చెప్పెను. మనము మనుష్యులతో చాలాసేపు మాట్లాడినప్పుడు ఇది నిజమని మనము తెలిసికొగలము. మితముగా మాట్లాడుటకంటె మొదలు మాట్లాడకుండుటయే సులభము. జనసమూహాముమధ్య జాగ్రతగాసంచరించుటకంటె యింటిదగ్గర ఒంటరిగా నుంటయే సులభము. కనుక ఆత్మజీవనమున వృద్ధిపొందదలచిన వారందరు ఏసుతో జనసంగమును విడిచిపెట్ట వలెను. ఎవరికి కనిపించక ఒంటరిగా సంతోషముతో ఇంటిలో నుండనేర్చినవాడుతప్ప మరియెవ్వడు నిర్భయముగా పదిమందిలోకి రాజాలడు. ఇష్టముతో మౌనముగా నుండనేర్చినవాడు తప్ప సురక్షితముగా మాట్లాడలేడు. వినయముతో నుండనేర్చినవాడు తప్ప ఎవడును ఇతరులకు ఆజ్ఞాపింపలేడు. అంతరాత్మవలన మెచ్చుకొబడినవాడు తప్ప మరియెవ్వడు నిర్భయముగా సంతోషింపలేడు. దేవునియందు భయముగలిగి యుండుటచే వారు నిర్భయులైయుండిరి. ఇంకను వారు తమ్మునుగూర్చి విస్తారముగా భయపడుచు అడకువ గలిగియుండిరి. ఏలయనగా వారు విస్తారమైన యోగ్యతతోను

పానత్వముతోను ప్రకాశించుచుండిరి. దుర్మార్గులు కూడ అహంభావముచేతను గర్వముచేతను నిర్భయముగా నున్నట్టు యోచించుచుండిరికాని అది చివరకు నిరాశగా మారిపోవును. నీవెంత యోగ్యుడవైనను ఈ జీవితములో నీవు నిర్భయముగా నుండగలవని నమ్మియుండకుము. మనుష్యులయొక్క ఎన్నికలో చాలా గొప్పవారుగానున్న అనేకులు తమ స్వశక్తిని విస్తారముగా నమ్మి చెడిపోయిరి. కనుక అనేకులకు తరుచు శోధింపబడుచుండుటయేమంచిది. వారావిధముగా శోధనలచేత తరుచు ముట్టడింప బడకపోయినయెడల తమకు భయములేదని తలచి గర్వముచే పాడగుదురు. మరియు అందువలన వారుప్రపంచక సుఖముల విస్తారముగా నపేక్షించి చెడిపోదురు. ప్రపంచక సంగతులలో ఎప్పుడు చిక్కుకొననివాడును, అల్పసుఖముల నిమిత్తము ప్రయత్నింపనివాడును ఎంతనిర్మలమైన హృదయమును గలిగియుండును! అన్నివిధములైన ఆశలను విడిచిపెట్టి ఎల్లప్పుడు దేవుని సంగతులను మాత్రమే యోచించుచూ తన మనస్సునంతయు దేవునియం దుంచగలిగిన మనుష్యుడు ఎంత విస్తారముగా చిత్తశాంతిని పొందగలిగి యుండును! అనుతాపము తనహృదయమున పూర్ణముగా నాటుకొనుటకు తగినంత శ్రద్ధతో ప్రయత్నింపనివాడు దేవుని యుపశాంతికి అర్హుడుకాడు. నీవు నీహృదయముయొక్క అనుతాపమును కోరితివేని "నీగదులలో ఎలుగెత్తి మొరబెట్టుకొనుము" అని వ్రాయబడినట్టు రహస్యమైన నీగదిలో ప్రవేశించి ప్రపంచక కల్లోలమును మూసిపెట్టుము. నీవు తరుచు బయిట పోగొట్టు

కొనుచున్న దానిని నీగదిలో నీవుమరల కలిగియుందువు. ఆ గదిలో నీవు ప్రవేశించినకొలదిని అది నీకెక్కువ యిష్టముగా గనిపించు చుండును. దానిలో నీవు తరుచుగా ప్రవేశించుట మానివేసినప్పుడు దానియందు నీయిష్టము తగ్గిపోవుచుండును. నీమత ప్రవేశమునకు ప్రారంభములో నీవు ఒంటరిగా నుండు టకు అలవాటుపడి దానిని విడిచిపెట్టనియెడల అదినీకు ప్రాణ స్నేహితునివలె ప్రియముగా గనిపించి నిన్నుచక్కగా ఆనం దింప జేయును. మతజీవితములోనున్న ఆత్మ మౌనముగా నుండుటచేతను ఏకాంతముగా నుండుటచేతను వేదములో గూఢముగానున్న అనేక రహస్యములను తెలిసికొనగలిగియుం డును. ఆత్మ ఆగదియందు ఒంటరిగా మౌనముతో నున్నసమ యమున ప్రతిరాత్రియందు ప్రవాహముగా బయలు వెడలు చున్నకన్నీరుచే తడపబడి తన్నుతాను పరిశుద్ధము చేసుకొను చుండును.

అందు అది ప్రపంచక కల్లోలమునకు దూరముగా నున్న కొలదిని తన్ను పుట్టించిన సర్వేశ్వరునితో ఎక్కువ పరిచయమును గలిగియుండుట సంభవించు చున్నది. ఎవడు స్నేహితులను పరిచయులను విడిచిపెట్టగలుగు చున్నాడో వానియొద్దకు దేవుడుపరిశుద్ధులైన తనదూతలతో జేరవచ్చును. ప్రపంచకములో తాను అనేక అద్భుతకార్యముల చేయగలిగి నను తనయాత్మ నుపేక్షించుట కంటె తానొంటరిగా ఏకాంత జీవితమున జీవించుటయు తనఆత్మనుగూర్చి తగినంత జాగ్రతను తీసుకొనుటయు చాలామంచిది. మత జీవితములో జీవించు

చున్న మనుష్యుడు తరుచు బహిరంగమునకు కనిపించడు. తాను సాధారణముగా ఇతరుల కంటబడడు. ఇతరులను తన కంట బడనివ్వడు. నీవుచూడరాని వస్తువులను ఏల చూడ గోరెదవు ? ప్రపంచకము గతించుచున్నది. దానితో దాని మోహావికారము కూడా గతించుచున్నది. ఇంద్రియసంబాధ ములైన కోరికలు మనలను అన్నిదిక్కులకు త్రిప్పు చున్నవి. కాని కాలము గతించినపుడు నీవు నీతో దేనిని తెచ్చితివి వేదనబడుచున్న మనస్సును పాపముచే బరువెక్కిన హృదయ మును మాత్రమె నీవు నీతో తీసుకురాగలిగిన సంగతులు. సంతోషముగా పయినముచేయువాడు విచారముతో యింటికి మరలవలసియుండును. ఉల్లాసకరమైన సాయంకాలము విచార కరమైన ఉదయకాలమును గలిగియుండును. ఇంద్రియ సుఖము లయందలి ఆనందము చల్లగా మనలోపల ప్రవేశించి చివరకు మనల బాధించి నాశనము చేయును. ఇక్కడ చూడలేని దానిని మరియొకచోట నీవెట్లు చూడగలవు ? భూమిని ఆకాశమును అన్ని భూతములను జూడుము. వీటితో అన్ని వస్తువులు చేయబడినవి. భూమిమీద నాశనముగాని వస్తు వులను నీ వెక్కడనైనా చూడగలవా ? నీవు చూడగల నని యోచించుచుంటివి. కాని నీకట్టి స్థితి ఎన్నడూ లభ్య ముగాదు. ఈయావత్తు ప్రపంచకమును, ఆప్రపంచకములోని అన్నివస్తువులను నీవు చూడగలిగినను అది నీకేమి లాభము. అట్లుచూడగలిగి నందువలన నీకు లాభములేదు. పరలోకము నను న్న దేవునివంకకు కన్నెత్తి చూడుము. నీఅలక్ష్యమును

పాపములను క్షమింపవలసినదని ప్రార్థించుము. ఈవ్యర్థములైన సంగతులను వ్యర్థులకు విడిచిపెట్టుము. దేవుడు నీకు నియమించియున్న సంగతులమీాద నీమనస్సునంతయు గట్టిగా నిలుపుము. నీవు లోపలజేరి తలుపు మూసుకొనుము. నీకు ప్రేమాస్పదమైన యేసును దగ్గరకు చేరబిలువుము. నీవు నీగదిలోపల వానితోనుండుము. అపుడు నీవు కలిగియున్న నెమ్మదిని ఇక ఎక్కడను కలిగియుండవు. నీవు వెలపలకు వెళ్ళి లోకవృత్తాంతములను చెవియొగ్గి వినని యెడలనీవువలయునంత చిత్తవిశ్రాంతిని గలిగియుందువు. నీవుకొన్ని సమయములయందు క్రొత్త సంగతులను వినుటకు వేడుక పడుచుండుట వలన నీ మనస్సును కలత పెట్టుకొనుటకు నీవు అర్హుడవగుచుందువు.

## ఇరువదియొకటవ ప్రకరణము.

## హృదయానుతాపము.

నీయాత్మను వృద్ధిచేసుకొనదలచినయెడల దేవునియెడల భయభక్తులనుగలిగియుండుము. విస్తారముగా స్వాతంత్రియమును గలిగియుండుటకు ఎన్నడు సాహసింపకుము. నీ యింద్రియములనన్నిటిని నీస్వాధీనమునందుంచుకొనుము. తుచ్ఛసుఖముల ననుభవించుట కెన్నడును ప్రయత్నింపకుము. నీ మనస్సు నిజమైన అనుతాపమును గలిగియున్నయెడల నీకు భయభక్తులు గలుగును. అనుతాపము అనేక లాభములను గలిగించును. అది లేనప్పుడు అన్నిలాభములు నశించును. మనుష్యు

డు తా ననుభవించుచున్న దుస్థితిని సరిగా యోచింపగలిగిన యెడల ఎవరును యీ జీవితములో పూర్తిగా సుఖింప లేక పోవుచున్నందుకు ఆశ్చర్యముగా గనిపించును.

మనమనస్సు చపలత్వమును గలిగియుండుటచేతను మన యందున్న దోషములను ఆలోచింపలేక పోవుటచేతను మన ఆత్మపడుచున్న పరితాపమును మనము తెలిసికొనలేకపోవు చున్నాము. కనుక మనము నిజముగా దుఃఖింపవలసియున్న సమయములలో వ్యర్థముగా నవ్వుచున్నాము. పావనమైన హృదయముతో దేవునియందు భయభక్తులు గలిగియున్ననే తప్ప మనస్సునకు నిజమైన స్వాతంత్రియమును యదార్థ మైన యానందమును లభించదు. ఆటంకము పెట్టుచున్న కలతలను విడిచిపెట్టి తన మనస్సు అనుతాపమునకు దెచ్చు కొనిన మనుష్యుడు నిజముగా ధన్యుడు. తన హృదయమునకు చెడుగు చేయుచున్న సంగతుల నన్నిటిని మనస్సునుండి తరిమి వేసినవాడు ధన్యుడు. మగతనముతో అణచిపెట్టుము. ఒక అభ్యాసము దానికి ప్రతికూలమయిన మరియొక అభ్యాసము చేత జయింపబడును. ఇతరుల సంగతులను నీవు కలుగజేసి కొననియెడల నీసంగతులను ఇతరులు కలుగజేసుకొనరు. అపుడు నీపనిని నీవు చక్కగా చేసికొనుటకు నీకు వీలుగలుగును. కనుక నీవెప్పుడు ఇతరుల సంగతులలో జోక్యము గలుగజేసు కొనకుము. నీకన్న గొప్పవారి వ్యాపారములలో కూడా నీ వెప్పుడు ప్రవేశింపకుము. ముందట నీకన్నును నీమీదనే

యుంచుకొనుము. నీ స్నేహితులను మందలించుటకు బదులుగా ముందునిన్ను నీవు మందలించుకొనుము.

మనుష్యుల దయ నీవు సంపాదించు కొనలేక పోయిన యెడల నీవు విచార పడకుము. దేవుని దాసుడవైయుండుటకు దగినంత యోగ్యతతో జీవింప లేక పోయినందుకును, స్వేచ్ఛమైన మతజీవితములో జీవింపలేకపోయి నందుకును విచారింపుము. ఈజీవితములో మనుష్యుడు తరుచు ఉపశాంతులను కలిగియుండక పోవుట చాలా మంచిది. అందులో ముఖ్యముగా ఇంద్రియ సంబంధములైన యుపశాంతులు కలుగక పోవుట మరీమంచిది. దేవుని ఉపశాంతులను మనము తరుచు పొందలేనియెడల ఆదోషము మనయందే ఉన్నది. ఎందుచేతననగా మనహృదయమునకు అనుతాపము గలుగ లేదు. ఇంతేకాకుండా మనము వ్యర్థమైన ప్రపంచక సుఖములను పూర్తిగా విడిచి పెట్టలేక పోవుచున్నాము. కనుక నీవు దేవుని యుపశాంతికి ఎంత మాత్రము అర్హుడవుగానుండక ప్రపంచక కలతలనుపొందుటకుమాత్రము తగియుంటివి. మనుష్యుడుపూర్ణముగా అనుతాపమును గలిగియున్నయెడల యావత్తు ప్రపంచకము వానికి దుఃఖకరముగాను అసహ్యాకరముగాను కనిపించును. మంచిమనుష్యుడు ఎల్లప్పుడు తానువిచార పడుటకును శోకించుటకును తగినకారణమును కనిపెట్టగలుగు చున్నాడు. ఎందుచేత ననగా తన్ను గురించి గాని లేక తనతోడి మానవుని గురించి గాని చక్కగా విచారించి నప్పుడు ఈ లోకములో కలతలను అనుభవింపని మనుష్యుడెవడును లేనట్టు అతడు తెలు

నుకొనగలుగుచున్నాడు. తన్నుతాను గట్టిగా పరీక్షించుకొను చున్న కొలదిని తాను విచారపడుటకు గొప్ప కారణము లున్నట్టు కనిపెట్ట గలుగు చున్నాడు. మనముచేసిన పాపము లును మనము యోచించుచున్న దురాలోచనలును మన విచారమునకును హృదయానుతాపమునకును తగినకారణములై యున్నవి. మనము పాపములో చిక్కియుండుట చేతను దుర్మార్గమును యోచించు చుండుటచేతను మనము పరలోక సంగతులను యోచింప లేక పోవుచున్నాము. నీవువిస్తారమైన నీ జీవితకాలమును విచారించుటకంటె మరణమును తరుచు విచారించు కొనుచున్నయెడల నీజీవితమును నీవు దిద్దు కొన ప్రయత్నింతువు. ముందు నీయాత్మ అనుభవింపవలసి యున్న నరకబాధలను నీమనస్సులో చక్కగా ఆలోచించి గ్రహించుకొన్న యెడల ఈ ప్రపంచక కష్టములకును బాధల కును నీ వెంతమాత్రము వెనుక తియ్యకయిష్టముతో నీవు వాటిని అనుభవింప గలవని నేను నమ్ముచున్నాను. ఎందుచేత ననగా ఈ సంగతు లింత వరకు మన మనస్సున నాటక పోవు టచేత ఈజీవితముయొక్క సుఖములకు ఆనందించు చున్నాము. ఇందుచేతనే మతముయొక్క సంగతులలో మనము మాంద్య ముగా నున్నాము. తగినంత ధైర్యము లేకపోవుటచేత దుస్థి తిలో నున్న యీ నీచమైన శరీరము తరుచు మొఱబెట్టుచున్నది. కావున నీహృదయమునకు అనుతాపమును గలిగించి నిన్ను రక్షించుటకు తగినంత అణకువతో దేవుని ప్రార్థించుము. “ఓ ప్రభువా ! కన్నీళ్ళను నాకాహారముగా నిమ్ము. విస్తారమైన

కన్నీళ్లను నాకు పానముగా నిమ్ము" అని ప్రవక్తతో ప్రార్థించుము.

---

## ఇరువదిరెండవ ప్రకరణము.

## నరుని దుస్థితి.

దేవునివంకకు గాక నీవు మరియేవంకకు తిరిగినను, ఎక్కడనున్నను నీవు దురదృష్టవంతుడవు. నీవు కోరిన ప్రకారము సంగతులు జరగనప్పుడు నీవేల కలవరపడెదవు? తన యిష్టప్రకారముగా కార్యములు జరుగుచున్నవాడు ఎవడైన కలడా? నీకుగాని, నాకుగాని లేక ఈభూమిమీద మరియొకనికి గాని కోరిన కోరికలు సిద్ధించుచున్నవా? రాజుగాని గురువుగాని ఈలోకములో కలతనొందని మనుష్యుడెవ్వడు లేడు. ఈప్రపంచకములో ఇకపూర్తిగా సుఖమనుభవించు చున్నవాడెవడు? దేవునికొరకు ఓరిమితో భరింపనేర్చినవాడే.

"వాడెంత అదృష్టవంతుడు? ఎంతధనవంతుడు? ఎంత బలవంతుడు! ఎంతశక్తివంతుడు!" అని తెలివిలేనివారును బలహీనమైన మనస్సు కలవారును తరుచు చెప్పుకొనుచుందురు. ఆ పరలోక ధనమువంకకు కన్నెత్తిచూడుము. ప్రపంచక సంబంధములైన అశాశ్వత పదార్థములన్నియు లాభములేని వని తెలిసికొనగలవు. ఇవిఅన్నియు అస్థిరములు. బాధకరములు. ఆతురముతోను భయముతోను సంపాదింప బడుచున్నవి. అస్థిరపదార్థములను విస్తారముగా కలిగియున్నంత

మాత్రము చేత మనుష్యుడు సౌఖ్యవంతుడు గానేరడు. వాటిని మితముగా కలిగియుండుటయే మంచిసంగతి. ఈ ప్రపంచకములో బ్రతికియుండుట చాలా నీచమైన సంగతి. మనుష్యుడు జీవములో ప్రవేశించినకొలదిని (ఆత్మాభివృద్ధి నొందినకొలదిని) ఈ ప్రస్తుత జీవితము వానికసహ్యముగా కనిపించు చుండును. ఎందుచేతననగా నరుని స్వభావము భ్రష్టీకరించినట్లు అతడు స్పష్టముగా తెలుసుకొను చున్నాడు.

ఎందుచేతననగా భోజనముచేయుట దాహముత్రాగుట, నిద్రించుట, జాగ్రతగా నుండుట, పాటుపడుట, విశ్రమించుట ఇతర శరీరధర్మములకు చిక్కియుండుట మొదలైనవన్నియు మతములోనున్న మనుష్యునకు చాలా బాధకముగా నుండును. అతడు పాపమునుండి విడిచిపెట్టబడుటకు సంతోషముగా కోరుచుండును. ఈజీవితములో శరీరధర్మములు తప్పనిసరిగా బాధించుచుండుటచే ఆంతరంగిక పురుషుడు మిగుల వ్యధజెందుచుండును. కనుక ప్రవక్తవాటినుండి విడిపింపబడుటకు ఈవిధముగా భక్తితో దేవుని ప్రార్థించును. " నాహృదయ వేదనలు అతివిస్తారములు. ఓ ప్రభువా! ఇక్కటులలోనుండి నన్ను విడిపింపుము " తమదుస్థితిని తెలిసికోలేనివారు మిగుల బాధపడుదురు. దుస్థితితోగూడిన ఈభ్రష్టజీవితమును అపేక్షించువారు అంతకన్న ఎక్కువగా విచారపడుదురు. ఈ పాడు జీవితము నాశించు చున్న బుద్ధి హీనులు కొందరు గలరు. వారు బిచ్చమెత్తిగాని లేక మరియొక విధముగా శ్రమపడికాని శరీరమును మాత్రము పోషింప గలుగు

చున్నారు. వారుఎల్లకాలము బ్రతుకవలెనని తలచుచున్నారు. వారు దేవుని రాజ్యమునకు ఎంతమాత్రము ప్రయత్నించుచుండలేదు. ప్రపంచక సంగతులలో మునిగి శరీర భోగములు తప్ప ఇతర సంగతులు రుచింపనివారు ఎంత తెలివి హీనులు! ఎంత విశ్వాసహీనులు! తుదకు ఈదురదృష్టవంతులు తమరు ఎట్టినిష్ప్రయోజనము లైన పదార్థములను ఆశించియుండిరో తెలిసికొని ఖేదపడగలరు. దేవునిభక్తులును క్రీస్తుయొక్క స్నేహితులును ఇంద్రియములకు హితవులైన పదార్థములను ఎన్నడు ఆశించి యుండ లేదు. వారు చిరు సుఖములను సైతము అపేక్షించలేదు. వారు శాశ్వతమైన ధనము కొరకు మాత్రమే ఆశించి దృష్టినంతయు పైకినిగిడించి శాశ్వతమైన అదృశ్య పదార్థమును చూచు చుండిరి. కనిపించుచున్న ఈ పదార్థములను చూడనపేక్షించిన యెడల ప్రపంచక విషయములచే నాకర్షింప బడుదురనిభయపడుచుండిరి.

ఓ స్నేహితులారా! జాగ్రతగా నుండుడు ఆత్మ జీవితములో అభివృద్ధి నొందవలెనన్న ఆశను విడిచిపెట్టకుడు. ఇంకను మీరు తగిన సమయమును సావకాశమును కలిగియున్నారు. కాలమింకను గతించలేదు. ఒకదినమునుండి మరియొక దినమునకు నీమంచి ప్రయత్నమును వలనిలుపు చేసెదవు. త్వరగాలెమ్ము ఈక్షణములోనే ప్రారంభింపుము. "పని చేయుటకిది యే సమయము. ఇదియే ప్రయత్నించుటకు తగినకాలము. నిన్ను నీవు సవరణచేసుకొన వలసిన యుక్తకాలమిదియే" అని చెప్పు

ము. నీవు బాధలలో ఉన్నప్పుడే నీవు నీయోగ్యతకు తగిన ఫల మును పొందవలసిన మంచిసమయము “ భాగ్యముగలస్థలము లోనికి ” జేరపోవుటకుముందు నీవు నిప్పులమధ్యనుండియు నీళ్ల మధ్యనుండియు ప్రయాణము చేయవలసియుందువు. నిన్ను నీవు హింసించుకొనిననే తప్ప నీనీచమైన స్వభావమును నీవు జయింపజాలవు. ఈనాశన స్వభావముగల శరీరమునుధరించి యున్నంతవరకు మనము పాపముచేయకుండా ఉండలేము. అలసటతోను బాధతోను మనము బ్రతుకవలసి యున్నాము. పాపములవలన మనము మనయోగ్యతను చెడగొట్టుకొనుచు న్నాము. లేనియెడల మనదుస్థితినివిడిచి నెమ్మదిగా నుందుము. మనము పాపమువలననే మనసుఖమునుకూడా చెడగొట్టు కొనుచున్నాము. కనుక దేవుని యనుగ్రహము కొరకు దుర్మా ర్గము తొలగి మర్త్యమైనది జీవముచేత మ్రింగబడువరకు ఓరిమితో వేచియుండవలెను.

నరుని స్వభావ మెంత చెడ్డది! వానిహృదయముయొక్క తలంపులలోని ఊహ అంతయు యెల్లప్పుడు కేవలము చెడుగు చేయుటకే కోరుచున్నది. ఈదినమున నీపాపములను నీవు ఒప్పుకొందువు. ఆపాపములనే నీవు రేపు మరలచేయుదువు. చక్కగానడుచుకొనుటకు ఇపుడు నీవు నిశ్చయించుకొంటివి. కొంచెముసేపులోనే నీవెంతమాత్రము నిశ్చయము చేసుకోన ట్లు యథాప్రకారముగా నడుచుచుందువు. కనుక మనమెల్లప్పు డు అణకువతో తగ్గియుండుటకును ఒకప్పుడైనాగొప్పవారమని గర్వింపకుండుటకును తగినంత కారణమును గలిగియున్నాము.

ఏలయనగా మనము చెడు స్వభావముగలవారము. నిలకడలేని వారము. విస్తారము శ్రమపడి బహుప్రయాసతో దేవునియను గ్రహామువలన స్వల్పముగా పొందియున్న దానినికూడా, అలక్ష్య ముచేసి చెడగొట్టుకొనుచున్నాము. జీవితముయొక్క ప్రారంభ ములోనే మన మశ్రద్ధచేసినయెడల తుదకు మనగతియేమగు ను? మనమాటలయందు తగినంత పావనత్వము కనుపించక పూర్వమేమనము నిర్భయులమై యున్నట్టును నెమ్మదిగా నున్న ట్టునుతలచి అలక్ష్యముగా నున్న యెడల మనము చాలా ఖేదము నొందవలసి యుందుము. మనముకూడా క్రొత్తగా ఆరంభించిన వారివలె ప్రతినిత్యము అదియె నూతనమైనట్టు పావనజీవితము నుపదేశింప బడితిమేని మనము ముందు నడతను సవరించు కొనుటకును ఆత్మసంగతులలో గొప్ప అభివృద్ధిచెందుటకును దగిన సావకాశము గలిగియుందుము.

---

## ఇరువదిమూడవ ప్రకరణము.

## మరణచింతనము.

ఈ లోకమున నీ జీవితము త్వరలో ముగియబోవు చున్నది. అవల పరలోకములో నీగతియేమగునో ఆలోచించు కొనుము. ఈదినమున మనుష్యుడు ఇక్కడ కనిపించుచున్నా డు. అతడు రేపు మనకు గనిపించుటలేదు. అతను మన దృష్టి నుండి ఎప్పుడు తొలగునో, మనస్సునుండి కూడా అప్పుడే తొలగును. అహా! నరుని మనస్సు ఎంత మూఢమైనది!

ఈ ప్రస్తుత సంగతి తప్ప ఆవల తన గతి యేమగునో ఆలోచింప లేక పోవుచున్నది. నీ వీ దినముననే చావవలసియున్నట్టు నీ తలపులలోను పనులలోను నిన్ను నీవు నియమించుకొనుము. నీ హృదయము పరిశుద్ధమైన యెడల నీవు చావున కంతవిస్తారముగా భయపడకపోదువు. చావునకు వెరచి పారిపోవుటకంటె దోషములను విడిచిపెట్ట ప్రయత్నించుట మిగుల మంచిది.

ఈ దినముననే నీవు సిద్ధమైయుండని యెడల రేపెట్లు సిద్ధముగా నుండగలవు? రేపుమనకు నిశ్చయము లేదు. రేపటివరకు బ్రతుకగలవని నీవేలా ఎరుగుదువు. నడచుచున్న నడతలో మనము కొంచెమైనను సవరణ చేసుకోలేనప్పుడు మనము చాలాకాలము బ్రతికియున్నంత మాత్రమున ఏమిలాభము. మనము యెక్కువకాలము బ్రతుకుట వలన మన నడతయందు యోగ్యత ఎక్కువగాక పోయినను మన పాపము లెక్కువగుచుండును. ఈ ప్రపంచకములో చక్కగా నడుచుకొనుచున్న దినము ఒక్కటైనా ఉన్నదా? తమరు మతములో ప్రవేశించి ఎంతకాలమైనదో అని లెక్క చూచుకొనుచున్న వారనేకులు గలరు కాని వారు కొంచమైనను వారి నడతను సవరణ చేసుకోలేక పోవుచున్నారు. చచ్చుటయే భయమైన యెడల బహుకాలము బ్రతుకుట యెక్కువ అపాయకరము. ఎల్లప్పుడు తన మరణదినమును తన కన్నుల యెదుట చూచుచున్నవాడును చావునకు ప్రతిదినము తన్ను తాను సిద్ధము చేసుకొన్నవాడును నిజముగాధన్యుడు. ఎప్పుడైనా నీవొకమనిషిని చచ్చిపోవుచుండగా చూచిన యెడల నీవు

కూడా అత్రోవనే వెళ్ళవలసియున్నట్లు జ్ఞాపకముంచుకొనుము. అది ఉదయకాలమైన యెడల సాయంకాలము పడకమునుపే నీవు చావవచ్చునని భావించుము. సాయంకాలమైన యెడల అమరుచటి ఉదయమువరకు నీవు బ్రతుకగలవని తలంచకుము. ఎల్లప్పుడు నీవు చచ్చుటకు సిద్ధమై యుండుము. నీవు సిద్ధము కానిదే చావకుండుటకు మెళకువగలిగి జీవింపుము. అనేకులు ఆకస్మికముగా అనుకొనని సమయములో చనిపోవు చుండిరి. మనుష్యకుమారుడు మన మనుకొనని గడియలో వచ్చును. అంత్యకాలము సమీపించినపుడు వెనుకనీవు జీవించిన జీవిత కాలమునుగూర్చి వేరు అభిప్రాయమును గలిగియుందువు. నీవు చేసియున్న అశ్రద్ధను లోపములను నీవు విస్తారముగా ఖేదపడుదువు. మరణకాలములో తానెట్లు నడిచిన బాగుండు నని కనిపెట్టునో ఆ విధముగా నడుచుకొనుటకు బ్రతికియున్న కాలములోనే ప్రయత్నించినవాడు ఎంతధన్యుడు! ప్రపంచక మును పూర్తిగానిరశించుట యోగ్యతలో అభివృద్ధి జెందుటకు దృఢమైన పట్టుదల గలిగియుండుట అను తాపముగలిగి బాధ పడుట శిక్షయందు ఆసక్తి అణకువగలిగి యుండుట క్రీస్తు మీద ప్రేమచే ఎటువంటి బాధనైనను సహనముతో భరింప గలుగుట, తనలాభమును కోరికలను పూర్తిగా విడిచిపెట్టుట ఇవి అన్నియు సుఖమైన మరణమునకు సాధనములు నీవు మంచి ఆరోగ్యములో నున్నపుడు ఎక్కువ మేలు చేయగలవు. నీవు జబ్బుగానున్నప్పుడు సాధారణముగా ఏమంచికార్యమును చేయలేవు. జబ్బుగానున్నవారు ఎక్కువగా అభివృద్ధి బొంద

లేరు. వారు వారిని చక్కగా సవరణచేసుకోలేరు. తరుచు ఒకచోటునుండి మరియొకచోటుకు తిరుగుచున్న వారు కూడా పరిశుద్ధులుగా నుండలేరు.

నీ బంధువులను స్నేహితులను నమ్మకుము. ఇప్పుడైన్నా నీయాత్మ నభివృద్ధి చేసుకోతగిన సాధనముల నుపేక్షింపకుము. ఏలయనగా నీవనుకొనిన దానికంటె ఎక్కువ త్వరలో వారునిన్ను మరచిపోదురు. నీ వితరమనుష్యుల సహాయమును నమ్మియుండుటకంటె ముందునకు అక్కర గలిగిన దానిని ఈయుక్తమైన కాలములో సంపాదించుకొనుటయే మంచిది. ఇతరులు నీకు సహాయము చేయుదురని నమ్మక నీవు బాగుపడగలిగిన సాధనమును ఇప్పుడే చూచుకొనుము. ఇపుడు నిన్ను గూర్చి నీవు మెళుకువ గలిగి యుండని యెడల ఆవల నీకొరకు మెళుకువ గలిగియుండు వారెవరు? ఈప్రస్తుత సమయము చాలా విలువగలది. నీవు రక్షణము పొందవలసిన దినము లివియే ఇదియే మంచి సమయము శాశ్వత జీవితమునకు కావలసియున్న ధనమును సంపాదింప వలసియున్న యీసమయములోన జీవితకాలము నంతయు సోమరితనముచే వ్యర్థముగా గడిపి ఎట్లు పాడుజేసుకొను చున్నావు! నిన్ను నీవు సవరణ చేసుకో దలచెడి కాలము ముందు సమీపించును గాని అది నీకనుగ్రహింప బడునో లేదో నాకు తెలియదు.

ఓ న్యాప్రియ సహోదరుడా నీచావును యెల్లప్పుడు తలుచుకొనుచున్నప్పుడును నీవు చావునకు యుక్తమైన రీతిని

భయపడు చున్నప్పుడును ఎంత గొప్ప యాపదనుండి నిన్ను నీవు రక్షించుకొన గలుగుదువు ! ఎంత గొప్ప భయమునుండి నిన్ను నీవు తొలగించుకొన గలుగుదువు. మరణసమయమున నీవు భయపడుట కంటె ఆనందింప గలుగునట్లు జీవించుటకు నీవిప్పుడే పాటుపడుము. నీవు క్రీస్తుతో గూడా జీవింప ప్రారంభించుటకు ప్రపంచక దృష్టికి క్రీస్తుతో చని పోవుటకు నేర్చు కొనుము. నీవు స్వతంత్రముతో క్రీస్తును సమీపించుటకు ప్రపంచక వస్తువులనన్నిటిని నిరశింపుము. అనుతాపముచే నీ శరీరమును నలగ గొట్టుము. అందువలన నీవు నిర్భయముగా నుండగలవు. ఓమూర్ఖుడా నీలోకములో ఒకరోజైనను బ్రతుకుటకు స్థిరము లేనప్పుడు బహుకాలము ఏల బ్రతుక వలెనని కోరెదవు. ఎంతమంది యీ విధముగా మోస పోయిరి ! ఎంత మంది ఆకస్మికముగా చనిపోయిరి. అటువంటి మనుష్యుడు చంపబడెను. వాడు నీటిలోమునిగి చచ్చిపోయెను. వాడుక్రింద పడిచచ్చి పోయెను. ఒకడు భుజించుచూ చచ్చిపోయెను. మాడలాడుచూ చచ్చి పోయెను. ఆట లాడుచూ చచ్చి పోయెను. అనువార్తలను మన మెంత తరుచుగా విను చున్నాము. ఒకడు అగ్గిలో పడి దహన మైనట్టును మరియొకడు కత్తితో నరకబడినట్టును ఇంకొకడు రోగముచేత చచ్చి పోయినట్టును మనము వినుచున్నాము. ఏదో ఒక విధముగా మరణము ప్రతివానిని అంతము నొందించుచున్నది. మనుష్యుని ఆయువు నీడవలె నిలువక గతించుచున్నది.

నీవు చనిపోయిన తరువాత నిన్నెవరు జ్ఞాపక ముంచు

కొందరు ? నీనిమిత్తమెవరు ప్రార్థింతురు ? నీవు చేయుటకు శక్తిగలిగిన దానిని ఇప్పుడే చేయుము. ఏలయనగా నీవెప్పుడు చనిపోదువో నీవెరుగవు ? నీవుచనిపోయిన తరువాత నీకేమి సంభవించునో నీకు తెలియదు. నీవిప్పుడు సావకాశమును గలిగి యుంటివి. కనుక శాశ్వత ధనమును కూడబెట్టుము. నీ ఆత్మ రక్షణమును తప్ప యికదేనిని విచారింపకుము. దేవుని సంగతులకు తప్ప ఇకదేనికి శ్రద్ధ తీసుకొనకుము. దేవుని భక్తులను గారవించి వారితో స్నేహము చేయుము. వారి పనులను నీవలవరుచు కొనుటచేత నీవు నీశాశ్వత నివాసమును చేరలేక పోయినను అవినిన్ను శాశ్వత నివాసమున ప్రవేశపెట్టును. ఈ ప్రపంచక సంగతులతో సంబంధములేని పరదేశివలెను యాత్రికునివలెను ఉండుము. నీమనస్సును స్వేచ్ఛగానుంచుకొని దేవుని వంకకు లేవ నెత్తుము. ఎందుచేతననగా ఈలోకములో నీకు శాశ్వతమైన నివాసము లేదు. నీవు చనిపోయిన తరువాత నీజీవము సౌఖ్యముగా ప్రభుపుని జేరగలుగుటకు నీప్రార్థనలను నిట్టూర్పులను కన్నీళ్ళను దేవునివంకకు పంపుము.

---

## ఇ రు వ ది నా లు గ వ ప్ర క ర ణ ము .

## పాపశిక్షణము దేవుని తీర్పు.



నీవు చేయుచున్న ప్రతిపనికి తగిన ఫలమును పొంద వలసి యున్నావు. నీవు కఠినుడైన న్యాయాధిపతి ఎదుట ఎట్లు నిలుచుండ గలవు ! ఆయనకు తెలియకుండునట్లు నీవు

దేనిని దాచలేవు ? నీవు లంచములనిచ్చి ఆయన కోపమును చల్లారచలేవు. నీవు చెప్పెడి క్షమాపణలను ఆయన అంగీకరించడు. న్యాయమును బట్టి విచారించును. బుద్ధిలేని ఓపాపాత్ముడా ! నీవుకొన్ని సమయములలో కోపముతోనున్న నరుని చూచుటకు భయపడుదువు. అట్టి సంగతిలో నీ దుర్మార్గమునంతయు నెరిగియున్న దేవునికి ఎట్లు జబాబు చెప్పగలవు ? ఈ అనుకూలమైన సమయములోనే ముందు నీకు కావలసియున్న వస్తువులను సంపాదించుకొనుట చాలామంచిది. ఆ తీర్పుదినమున నీనిమిత్తము క్షమాపణల చెప్పువారును ప్రార్థించువారును ఎవరునులేరు. ఎవరి నిమిత్తము వారు దేవునిఎదుట జవాబు చెప్పుకోవలసి యుందురు. ఇదియే మంచి అనుకూలమైన సమయము. ఇపుడు నీవు పడినశ్రమలు ఫలించును. నీకన్నీళ్ళు అంగీకరింపబడును. నీ మూలుగులు ఆలకింపబడును. నీ కిపుడు గలిగిన అనుతాప దుఃఖము నీ వెనుకటి దోషములనుండి నిన్ను విడిపించి నీకు పరిశుద్ధత్వమును గలిగించును. ఓర్పు గలిగిన మనుష్యుడు సమస్త పాపములను విడిచి పరిశుద్ధముగా నుండును.

ఇతరులవలన తనకు బాధగలిగినప్పుడు ఆబాధకంటెను వారి దుష్టస్వభావమునకు యెక్కువగా బాధపడును. ఆతడు శత్రువుల నిమిత్తము దేవునిప్రార్థించును. ఇష్టముతో వారి నేరములను క్షమించును. తనవలన ఎవరికైనా కోపము గలిగినయెడల క్షమింపవలసినదని వారిని వేడుకొనుటకు కొంచెమైనను వెనుకదీయడు. ఇతరుల దగ్గర నేరమును కనిపెట్టునప్పుడు

కోపించుటకు బదులుగా జాలిపడును. తన్ను తాను బాధించు కొనుచుండును. శరీరమును ఆత్మకు వశపరుచుటకు ప్రయత్నించును. ఆవల దేవునిచే శిక్షింపబడుటకు మనపాపములను మూట కట్టుకొని దాచుకొనుట కంటె వాటినిపుడు ఇక్కడ విడిచిపెట్టుట మంచిది. మనశరీరముయొక్క అపరిశుద్ధమైన మోహమును మనము అణచి వేయ లేకపోవుటచేత మనలను మనము మోసము చేసుకొనుచున్నాము. నీవు జేసిన పాపములుగాక నిన్నుదహనముచేయగలిగిన అగ్ని ఇంకొకటికలదా? నిన్ను నీవు ఉపేక్షించి నీయిష్టమువచ్చినట్టు నీవు తిరిగినకాలదిని నీవు నీయింద్రియముల యొక్క కోరికలను వెంబడించిన కొలదిని ఆవలనీవు ఘోరముగా శిక్షింపబడుటకు నీపాపములు ఎక్కువగుచుండును. ఏలయనగా మండుచున్న నిప్పునకు నీవు మరియొక కట్టె పుల్లను తగుల్చు చున్నావు. ఏసంగతులలో మనుష్యుడు పాపముచేయుచున్నాడో ఆసంగతులలోనే వాడు క్రూరముగా శిక్షింపబడుచుండును. బద్ధకస్తులందరు ఎర్రగా కాలిన ములుకోలతో ముందుకు పరుగెత్తింపబడుదురు. తిండిపోతులు ఆకలిచేతను దప్పికచేతను బాధపెట్టబడుదురు. శరీరభోగముల నాశించువారును ఇంద్రియ సుఖములకు సంతోషించువారును భగ్గున మండుచున్నతారులోను చెడువాసన గలిగిన గంధకపుమంటలోను స్నానము చేయింప బడుదురు. ఓర్వలేనివారు వెర్రి కుక్కలవలె దుఃఖముచే మొరుగుచుందురు. తగినట్టు క్రూరముగా బాధించని పాపమేదియు లేదు. అక్కడ గర్వితులందరు అనేక కలతలతో నిండియుందురు.

అత్యాశ గలవారు నీచమైన దరిద్రముతో విస్తారముగా బాధ పడుదురు. ఇక్కడ వేయి సంవత్సరములు అనుభవించెడి బాధ కంటె అక్కడ ఒక్కగడియ అనుభవించెడి బాధ మిక్కిలి క్రూరముగానుండును. అక్కడ దుష్టులకు సుఖముగాని నెమ్మదిగాని ఉండదు. ఇక్కడ మన కష్టములకు తెంపుగలను మనస్నేహితులు మనల ఓదార్చుచుందురు. తీర్పు కాలమున నీవును ధన్యులైన వారితో రక్షణనుపొంది సుఖింపగలుగుటకు నీవిప్పుడే నీనిమిత్తము నీవు ఆతురపడుము. నీకొరకు నీవు విచారపడుము. న్యాయముగానున్న మనుష్యుడు తన్ను బాధించుచున్న వారిని ఎదిరించుటకు తగినంత ధైర్యముతో నిలువగలిగియుండును. మనుష్యుల తీర్పునకు అణకువతో నిలువగలిగియుండును. మనుష్యుల తీర్పునకు అణకువతో లోబడిన వాడు తీర్పుతీర్చుటకు నిలువబడగలడు. అప్పుడు పేదవారును దీనులును బహువిశ్వాసమును గలిగియుందురు. గర్వితులు అన్ని వైపులనుండియు భయపడుదురు.

అప్పుడు క్రీస్తునిమిత్తము వెర్రివాడుగా నున్నవాడును తిరస్కరింపబడినవాడును ఈ ప్రపంచకములో మంచి జ్ఞానవంతుడై యున్నట్టు కనిపించును. అపుడు ఓర్పుతో మనము భరించియున్న బాధలన్నియు మనకు సంతోషమును గలిగించును అపుడు మౌనగాండ్రందరును వహానముతో నుందురు. అప్పుడు భక్తిగలిగిన వారందరు ఆనందించుదురు భక్తిలేని వారందరు ఖేదపడుదురు. శరీరభోగములను విస్తారముగా అనుభవించిన వానికంటె శరీరమును పీడించినవాడు ఎక్కువగా

సౌఖ్యపడుచుండును. అపుడు పేదవారి దుస్తులు ఎక్కువకాంతితో ప్రకాశించును. భాగ్యవంతుల విలువైన దుస్తులు కాంతి తగ్గి మకమకలాడు చుండును. ధగధగలాడెడి దివ్యభవనములకన్న పేదకుటీరములు ఎక్కువగా కొనియాడబడుచుండును. ఈప్రపంచక బలములన్నిటికన్నను ఎడతెగని ఓరిమిమనకు ఎక్కువ లాభకరముగానుండును. నిష్కపటమైన అణకువ ప్రపంచకజ్ఞానములన్నిటికంటెను ఎక్కువ హెచ్చునకు లేవదీయబడును. విస్తారమైన శాస్త్రజ్ఞానముకంటె యోగ్యమైన పరిశుద్ధహృదయము మనుష్యుని ఎక్కువగా ఆనందింపజేయుచుండును. అప్పుడు ప్రపంచకలాభముల నపేక్షించుచున్న వారి ధనముకంటె ధననిరసనము ఎక్కువ గౌరవమును గలిగియుండును. నీవు సర్వభోగములను అనుభవించినప్పటికంటె నీవు భక్తివిశ్వాసములతో దేవుని ప్రార్థించినప్పుడు మిక్కిలి యెక్కువగా సుఖింపగలవు. మితముతప్పి మాట్లాడునప్పటికంటె మౌనముగానున్నప్పుడు విస్తారముగా సంతోషించుచుందువు. మంచిమాటలకంటె మంచికార్యములు ఎక్కువ విలువగలిగి యుండును. ఈప్రపంచకసుఖము లన్నిటికంటెను కచ్చితమైన జీవితము అనుతాపము బహుఇష్టముగా నుండును. ఇపుడు నీస్వల్పకష్టమును భరించుటకు అలవాటుపడుము. ఆవల బాధకరములైన గొప్పకష్టములనుండిభరింపగలవ్వావ్వెవ్వా ఇప్పుడుఇక్కడనే రుజువుచేసికొనుము. ఇక్కడ నీవుస్వల్పబాధలను భరింపలేకపోయిన యెడల ఆవల శాశ్వతమైన నరకబాధలను ఎట్లు భరింపగలవు? మిక్కిలి స్వల్పబాధయే నిన్నింతగా బాధించి

యేడ్పించు చున్నప్పుడు ఆవల మిక్కిలి దారుణమైననరకాగ్ని నిన్నేమిచేయునని అనుకొనుచుంటివి ? నీవు ఈలోకములోను పరలోకములోను ఈ రెండు లోకములలోను సుఖపడగలవని అనుకొనకుము. నీవు ఈ ప్రపంచక సుఖములనైనా అనుభ వింపవలెను. లేదా, పరలోకములో క్రీస్తుతో ప్రభుత్వము నైనా చేయవలెను. ఇంతవరకు నీవు కీర్తితోను గౌరవము తోను భాగ్యముతోను అనేకసుఖముల ననుభవించితివి. ఈ గడియలో నీవు చనిపోయినయెడల ఇవి అన్నియు నీకేమి లాభము ఇవి అన్నియు వ్యర్థములే దేవునిప్రేమించుట సేవిం చుట ఇవి మాత్రమే లాభమైనవి. ఇష్టముతో దేవుని ప్రేమిం చినవారికి చావునకును నరకమునకును భయపడ నవసరము లేదు. శిక్షకును తీర్పునకును వారెంతమాత్రము భయపడరు. పరిపూర్ణమైన ప్రేమనిర్భయముగా దేవుని సమీపింపజేయును. పాపకార్యములకు ఆనందించెడు మనుష్యుడు చావునకును తీర్పునకును భయపడుచుండుట ఏమివింత ! దేవుని ప్రేమ నిన్ను పాపముల నుండి మళ్ళింపలేక పోయినయెడల నరకము యొక్క భయమైనను నిన్ను పాపములనుండి అడ్డుపెట్టగలిగిన యెడల మంచిదే. దేవుని భయమును విడిచిపెట్టినవాడు బహు కాలము మంచిమార్గమున నుండలేడు. అతడు అతిశీఘ్రములో సాతాను వలలలో పడును.

---

# ఇరువదియైదవ ప్రకరణము.

## జీవితములయొక్క సవరణ.

దేవుని సేవయందు మెళకువగాను శ్రద్ధగానుఉండుము. నీవీ ప్రపంచకములోకి ఏల వచ్చితివో ఈ ప్రపంచకమును నీవెందుకువిడిచిపెట్టవలసియుంటివో చక్కగా ఆలోచించుము. నీవు దేవునితో నివసింపగలిగి యుండుటకును జీవపురుషుడవై యుండుటకును కారణములై యున్నవి. అందుకొరకు నీ ఆత్మను అభివృద్ధి చేసుకొనుటకు నీవు త్వరపడుము. కొద్ది కాలములోనే నీకష్టము ఫలించి నీవు దానికి తగిన ఫలము ను పొందుదువు. నీవు ఉన్నచోటభయముగాని దుఃఖముగాని ఉండదు. నీవిపుడు కొంచెము శ్రమపడితివేని ఆవల విస్తారమైన విశ్రాంతిని తెంపులేని ఆనందమును నీవనుభవింపగలవు. నీవు నీకార్యములను ఎడతెగనిభక్తితోను విశ్వాసముతోను నెర వేర్చిన యెడల, దేవుడు నీకు దానిఫలమును గలిగించుటకు ఎక్కువ ఔదార్యముగాను విశ్వాసముగాను ఉండును. నీవు జయముపొందుటకు నిరీక్షించి యుండుము. కాని నీవునిర్భయు డవై యున్నావని అనుకొనకుము ఎందుచేతననగా అందువలన గర్వము, ఉపేక్షగలిగి చెడిపోదువేమో. కనుక నీవు నిర్భయ ముగా నుండకుము. ఒకప్పుడు ఒకడు సంశయముతో బాధ పడుచుండెను. కొన్నిసమయములయందు వానికి దేవుడు తన్ను రక్షించునని ఆశగలుగుచుండెను. మరికొన్ని సమయములయం దు వానికి దేవుడు రక్షింపడేమోఅని భయము గలుగుచుం

డెను. ఈవిధముగా వానిమనస్సు భయముతోను ఆశతోను ఊగులాడుచుండుటచే అతడు దేవుని పీఠము దగ్గరకువెళ్లి సాష్టాంగపడి "ఓ దేవా! నేనురక్షింపబడుదునో లేదో అని తెలిసికొనగోరుచుంటిని" అని ప్రార్థించుచూ మనస్సులోఅనుకొనెను. అప్పుడు "నీకు దెలిసిన నీవేమి చేయుదువు. ఆచేయగలిగినదానిని ఇప్పుడే చేయుము. అపుడు నీవురక్షింపబడుదువు" అని వెంటనే వాని మనస్సులో దేవుడు ప్రత్యుత్తరమిచ్చినట్టు వానికి వినిపించెను. అతడీవిధముగా దేవునినుండి ఉపశాంతిని పొందినతోడనే నూతనబలము గలిగి తన మనస్తాపమును తొలగించుకొనెను. అదిమొదలు అతడు తనకు ముందు ఏమి జరుగునోయని మరలఎన్నడు తెలిసికొనప్రయత్నింపక తాను చేయబోవుచున్న ప్రతి కార్యమునకు ప్రారంభమున ఉత్తమమును సంపూర్ణమును అనుకూలమునైయున్న దేవుని చిత్తమేదో పరీక్షించి తెలిసికొనుటకు ప్రయత్నించుచుండెను.

"సర్వేశ్వరునియందు నమ్మికయుంచి మేలు చేయుము. దేశమందు నివసించి సత్యముననుసరించుము. సర్వేశ్వరుని బట్టి సంతోషించుము. ఆయన నీహృదయవాంఛలను తీర్చును" అని ప్రవక్త చెప్పుచున్నాడు. జీవితములను సవరణ చేసికొనుటకు అవసరమైయున్న శ్రద్ధనుండియు ఆత్మాభివృద్ధినుండియు అనేకులను వెనుకకులాగుచున్న సంగతియొకటికలదు. అది ప్రయాసపడవలసి వచ్చునని భయపడుట. పోరునకు వెరచి అనేకులు వెనుకకు తగ్గుచున్నారు. అయినను వారు యోగ్యతను అలవరుచుకొనుటలో ఇతరులను అతిశయించుచున్నారు. వారుతమ

కు బాధకరముగాను అసహ్య కరముగాను కనిపించుచున్న సంగతులను జయించుటకు ప్రయత్నించుచున్నారు.

మనుష్యుడు ఎక్కువగా అభివృద్ధి చెందిన కొలదిని, దేవుని అనుగ్రహము విస్తారముగా పొందిన కొలదిని తన్ను తాను జయింపకలుగుచున్నాడు. మరిన్ని మనసునందు తన్ను తాను పీడించుకొనగలుగు చున్నాడు. మనుష్యు లందరు తమ్ము తాము పీడించు కొనుటకును జయించు కొనుటకును సమానమైన శక్తిగలిగియుండలేరు. శ్రద్ధ, పట్టుదల కలిగిన మనుష్యుడు అనేక కోరికల నశింపు చేసికొనవలసి యున్నను, యోగ్యత నిమిత్తము ప్రయత్నించుటకు శ్రద్ధలేని మంచి మనస్సు గలవానికంటె యెక్కువగా ఆత్మను అభివృద్ధి చేసుకొనగలిగియుండును. మనజీవితమును చక్కగా సవరణచేసి కొనుటకు మనకు రెండుసంగతులు ముఖ్యముగా అవసరములై యున్నవి. దుర్మార్గమునకు ఉద్రేకించుచున్న చెడుతలంపుల నుండి మనమనస్సును బలవంతముగా మరలించుకొనుట. మనకు అవసరమైయున్న యోగ్యతకొరకుపట్టుదలతో ప్రయత్నించుట. ఇతరులయందునీకసహ్యముగా కనుపించుచున్నదోషములను జయించుటకును వాటిని నీయొద్దనుండి తొలగించుకొనుటకును నిశ్చయపరుచుకొనుము. నీవు ప్రతిచోటునుండియు నీ ఆత్మలాభము పొందుటకు ప్రయత్నించుము. ఎవనియందైనను మంచిసంగతిని నీవు కనిపెట్టునప్పుడును వినినప్పుడును దానిని అలవరుచుకొనుటకు పాటుపడుము. ఎవనియొందైనా నీకు చెడుసంగతి కనుపించునప్పుడు దానిని నీవు నేర్చుకొనకుం

డుటకు పాల్గొనుటకు వలెనిగియుండుము. కొన్ని వేళలయందు ఆతప్పు నీయందుకూడా యున్నట్టు నీవు కనిపెట్టిన యెడల వెంటనే నిన్ను నీవు సవరణ చేసికొనుము. నీకన్ను ఇతరులను చూచు చున్నట్టు ఇతరుల కన్ను కూడా అదేవిధముగా నిన్ను జూచు చుండును. మన సహోదరులందరు శ్రద్ధ, భక్తి, మంచి శిక్ష మొదలయిన యోగ్యతలను గలిగియుండుటను మనముచూచి నప్పుడు మన కెంత సంతోషముగానుండును ఇతరులు అక్రమ మైన మార్గమున ప్రవేశించి విధాయకముగా చేయవలసి యున్న కార్యముల చేయక ఉపేక్షించుచు చున్నప్పుడు మన కెంతవిచారముగా నుండును. మన ఆత్మ జీవితమున కవస రములైయున్న సంగతులను విడిచిపెట్టి జోక్యము మాలిన సంగతులలో ప్రవేశించుట ఎంత అపాయకరము! నీవు చేయ వలసియున్న వ్యాపారములను జ్ఞాపకముంచుకొనుము. సిలువ వేయబడిన స్వరూపమును నీకన్నుల ఎదుట నిలుపుకొనుము. నీవు ఏసు జీవితమును చూచినప్పుడు నీవుబహు కాలముచుండి దేవుని మార్గములో నడుచుచున్నను నీ జీవితమును ఆయన జీవితమువలె చేసుకొనుటకు ప్రయత్నింపలేక పోయినందుకు నీవు సిగ్గుపడవలసియుంటివని తెలిసికోగలవు. ప్రభువుయొక్క భావములోను పవిత్రమైన మతజీవితములోను దృఢమైన భక్తి విశ్వాసములతో సాధనచేయుచున్న భక్తుడు తనకు అవసర ములైనట్టియు లాభకరములైనట్టియు సమస్తమును దాని యందు సమృద్ధిగా కనిపెట్టును. ఏసుగాక మరియే యితర పదార్థము వానికవసరములేదు. సిలువవేయబడిన ఏసుహృద

యములో ప్రవేశించినయెడల ఎంత త్వరలో సత్యమును నేను పూర్తిగా ఉపదేశింపబడుదును. మరి జీవితములోనున్న భక్తుడు తనకు విధింపబడిన దానిని ఇష్టముతో భరించును. శ్రద్ధాభక్తులు లేని మతస్థునకు కష్టములమీద కష్టములు సంభవించి సర్వవిధముల బాధపడుచుండును.

ఏలయనగా ఆతడు ఆంతర్యము నందలి ఉపశాంతిని పోగొట్టుకొనును. బహిరంగమైన యుపశాంతిని పొందలేక పోవుచుండును. తగిన శిక్షతో జీవింపని మతస్థుడు. తనఆత్మకు హాని చేసుకొనుచుండును. ఏకాంతస్థలమున మిగుల కచ్చితమైనజీవములో జీవించినవారు ఆయేకాంతస్థలమునువిడిచి అరుదుగా బయటకు వెళ్ళుచుందురు. వారుప్రపంచక సంగతులను విడిచిదూరమున ఒంటరిగా ఉందురు. వారు నిస్సారమైన ఆహారమును భుజించి చిరిగిన ముతగబట్టలను ధరించుదురు. వారు విస్తారముగా పాటుపడి పనిచేయుదురు. స్వల్పముగా మాట్లాడుదురు. వారు విస్తారముగా మెళుకువతో నుందురు. వారు యుక్తకాలములో పడకవిడిచి లేతురు. వారు ఎల్లప్పుడు ఎడతెగక దేవుని ప్రార్థించుచుందురు. వారు మంచిగ్రంథములను తరుచుగా చదువుచుందురు. వారు కఠినమైన శిక్షతో తమ్ముతాము కాపాడుకొనుచుందురు. ఇతరభక్తులందరు దేవునినామకీర్తనలతో ప్రార్థించుటకు రాత్రులయందు ఎట్లు మేలుకొనుచున్నారు? అనేకభక్తులు ఈవిధముగా దేవునినామకీర్తనలతో భక్తివిశ్వాసములు గలిగి ప్రార్థించుచుండగా అపవిత్రమైన కార్యములను మందబుద్ధితో ఉపేక్షింప దలచుట ఎంతసిగ్గు

పని ! ప్రభువైన దేవుని, మనస్సు చేత ఎల్లప్పుడు భక్తితో ప్రార్థించుట తప్ప మనకు ఏయితర పని చేయవలసిన అవసర ములేనప్పుడు అది మనకెంత సుఖముగా నుండును. అన్నము తినుట దాహాము త్రాగుట నిద్రపోవుట మొదలయిన శరీర ధర్మములు మనలను బాధించని యెడల అది మనకు ఎంత హాయిగా నుండును. అట్లయిన మనము ఎల్లప్పుడు తెంపు లేక ప్రార్థించుచూ జీవసాధనములలో మునిగి యుందుము. నీవు శరీరమును పోషించు కొనుటకు అక్కరగలిగి యున్నప్పటి కంటె దానిని తగ్గించినప్పుడు నీ కెక్కువ సుఖముగా నుండును. దేవుడు మనకీశరీర కృత్యముల పూర్తిగా లేకుండా జేసినను మన కాలము నంతయు ఆత్మ సంగతులను దెలిసికొనుటకు వినియోగింపక అప్పుడప్పుడరుదుగా మనము వాటిని చవిచూ చుచున్నాము. మనుష్యుడు ఏశరీరినుండియు తాను సుఖపడవ లెనని కోరనప్పుడు దేవునిమహిమ పూర్తిగా రుచిచూచుటకు ప్రారంభించును. అప్పుడాతడు గొప్పసంగతులకు సంతోషిం పడు. స్వల్పసంగతులను విచారపడడు. ఈ ప్రపంచకములో వానికేమి సంభవించినను సమాధానము గలిగి యుండును. గాఢమైన విశ్వాసముతో తన్ను దేవునికి వశపరచును. ఆతడు ఆయన మూలముగాను ఆయన ద్వారాను ఆయన నిమిత్తమును సమస్తమును గలిగి యుండును. ఆయనయందు ఏదియు చచ్చుట నశించుట లేదు. సర్వము ఆయనయందు జీవించుచున్నవి. కొంచెమైనను జాగు చేయక ఆయనను సేవించు చున్నవి. ఎల్లప్పుడు నీఅంత్యకాలమును జ్ఞాపకము

చేసుకొను చుండుము. నీవుపోగొట్టుకొనిన కాలము ఎన్నడూ కూడిరాదు. నీవు మెళకువను శ్రద్ధను కలిగియుండని యెడల నీవు యోగ్యతను సంపాదించలేవు. నీవు తగిన శ్రద్ధను కలిగి యుండని యెడల నీవు హాని నొందుదువు. నీవు ఆత్మ ఆవేశమును గలిగి యున్న యెడల దేవుని అనుగ్రహమును బట్టియు యోగ్యతయందు నీవుగలిగియున్న ఆసక్తిని బట్టియు నీశ్రమయొక్క భారమును కొంతవరకు తగ్గియున్నట్టు నీకు గనిపించి చిత్తశాంతిని గలిగి యుందువు. భక్తి విశ్వాసములు గల మనుష్యుడు అన్ని సంగతులకు సిద్ధముగా నుండును. పని పాటలలో పడవలసిన శ్రమకంటె దుర్మార్గమును దురాలో చనలను అణచివేయుటకు పడవలసియున్న శ్రమ ఎక్కువ కఠినమైనది. కొద్దిదోషములను నివారించుకొనలేని మనుష్యుడు క్రమక్రమముగా గొప్ప దోషములలో పడిపోవును. పగలం తయు లాభకరముగా గడపగలిగిన యెడల సాయంకాలమున సంతోషించు చుందువు. నిన్ను నీవు జాగ్రతగా చూచు కొనుము. నిన్ను నీవు పురికొల్పు కొనుము. ఇతరుల సంగతి యెట్లున్నను నిన్ను నీవు ఉపేక్ష చేసుకొనకుము. నిన్ను నీవు పీడించుకొనిన కొలదిని ఆత్మజీవితమున నీవెక్కువ అభివృద్ధి చెందగలుగుదువు.

---

# ఆంతరంగికజీవితము.

## రెండవ భాగము.

### మొదటి ప్రకరణము.

### ఆంతర్యజీవితము.

"దేవుని రాజ్యము మీమధ్యనేయున్నది" అని ప్రభువు చెప్పుచున్నాడు. ఇప్పుడైనను ఇష్టముతో నిన్ను నీవుప్రభువువంకకు త్రిప్పుకొనుము. ఈ చెడు ప్రపంచకమును విడిచిపెట్టుము. అపుడు నీ ఆత్మవిశ్రాంతిపొందును. బహిరంగపు సంగతులను తిరస్కరించి విడిచిపెట్ట నేర్చుకొనుము. అంతరంగ విషయములను ఆలోచించుము. అపుడు దేవుని రాజ్యమునీలోనే ఉన్నట్టు నీవు చూడగలవు. దేవుని రాజ్యము నీతియును సమాధానమును పరిశుద్ధాత్మయందలి ఆనందమునై యున్నది. ఇవి అపరిశుద్ధ హృదయములకు ఇవ్వబడవు. నీవునీలో క్రీస్తునివసించుటకు అర్హమైన ఇంటిని సిద్ధముచేసితివేని ఆయన నీదగ్గరకు వచ్చి తనయుపశాంతిని నీకు దెలియజేయును. ఆయన మహిమయు సౌందర్యమును నీలోపలనున్నవి. ఆయన అచ్చట తనంతట తాను ఆనందించుచుండును. అంతరంగపురుషునకు ఆయన తరుచు దర్శనమిచ్చి యింపుగా సంభాషించుచుండును. వానిని ఉపశాంతిపరచి సమాధానపెట్టుచుండును. మరియు ఆయనతో వానికి అద్భుతమైన పరిచయమును గలిగించుచుండును. ఓఆత్మ

పురుషుడా ! ఈ పెండ్లికుమార్తెతో కూడి యుండుటకు నీహృదయమును సిద్ధము చేసుకొనుము. ఆయన నిన్ను రక్షించును. నీయొద్దకువచ్చి నీతో నివసించియుండును. "నన్ను ప్రేమించువాడైతే నామాటగైకొనును. అప్పుడు నాతండ్రి వానిని ప్రేమించును. మేము వానియొద్దకువచ్చి నివాసము చేతుము" అని ఆయన చెప్పుచున్నాడు. ఇతరసంగతులను హృదయములోపల జొరనివ్వక క్రీస్తును మాత్రము లోపలప్రవేశింపనిమ్ము క్రీస్తును కలిగియున్నయెడల గొప్ప ధనవంతుడవగుదువు. సర్వమును పూర్తిగా కలిగియున్న వాడవును అగుదువు. ఆయననీకు సమస్తమును దయచేయును. నీవు నరుని నమ్మవలసిన యవసరము లేకుండా, ఆయననీకు సమస్తమును సందర్భపరుచును. మనుష్యులు త్వరలో మారిపోదురు. శీఘ్రముగా తప్పిపోదురు. క్రీస్తు ఎల్లప్పుడునుండును ఆయన మనప్రక్కనుతుదవరకు స్థిరముగానిలిచియుండును. మనకులాభకరముగాను ప్రియముగాను ఉన్నను నాశన స్వభావముగల నరుని ఆశ్రయించి వానిని ఆధారముగా చేసికొనకుము. ఒకప్పుడు నరుడు మనకు విరోధిగానున్నను మనమందుకు విచారపడ నవసరము లేదు. ఈ వేళ నీతో యిష్టముగానున్నవారు రేపునీతో విరోధింతురు. నేడు నీతో విరోధముగానున్న వారు రేపుమనకు స్నేహితులుగా నుందురు. ఏలయనగా నరుని స్వభావము గాలివలె చలనముగలిగి యుండును. నీనమ్మకమునంతయు ప్రభువునందే యుంచుము. ఆయన ఒక్కనికి మాత్రమే భయపడుము. ఆయన ఒక్కని నీవు ప్రేమింపుము. నీకొరకు ఆయన జవాబు ఇచ్చును. ఆయన నీకు

చాలా లాభమైన దానిని చేయును. నిలువరమైన పట్టణము
మన కిక్కడ లేదు. నీవెక్కడ నున్నను పరదేశివి. యాత్రి
కుడవు. నీవు అంతరంగమున క్రీస్తుతో కూడియున్ననే తప్ప
నీకు విశ్రాంతి కలుగదు. నీవు విశ్రాంతిపొంద తగిన చోటు
ఇక్కడ లేనప్పుడు నీచుట్టునున్న వస్తువులమీద నీకన్నును
ఏల ఉంచెదవు. మన శాశ్వతస్థితి పరలోకమందున్నది. ఈప్రపం
చక సంగతులన్ని ఈ మార్గమున మనకు తటస్థమౌచున్న
పదార్థములని యోచించుము. ప్రపంచక సంగతులన్ని త్వరలో
గతించును. నీవును వాటితో గతించుదువు. కనుక నీవు వాటిని
అంటుకొనకుండా చూచుకొనుము. నీవు వాటి నంటుకొనిన
యెడల నీవును వాటితో నశించుదువు. నీతలపుల నన్నిటిని
బహుహెచ్చైన దానిమీద నుంచుము. నీ ప్రార్థనలను తెంపు
లేక క్రీస్తువంకకు పోనిమ్ము. హెచ్చైన పరలోక సంగతులను
నీవు యోచింప లేనియెడల క్రీస్తుయొక్క భావములయందు
విశ్రమింపుము మరియు పవిత్రమైన ఆయన గాయములయందు
నివసింపుము. ప్రభువైన యేసుయొక్క మహిమగల గుర్తుల దగ్గ
రకు గాయములదగ్గరకును నీవు భక్తితో పరుగెత్తిన యెడల
కష్టసమయములయందు గొప్ప యుపశాంతిని పొంద గలుగు
దువు. నరులవలన నీకు బాధగలిగినను నీవు దానినిపాటింపవు.
నిన్నెవ్వరైన దూషించినను నీవు దానిని సహింపగలుగుదువు.
క్రీస్తు ఈప్రపంచకములో మనుష్యులవలన తిరస్కరింపబడెను.
ఆయన మిక్కిలి అక్కరగలిగియున్న సమయములో స్నేహి
తులవలన దూషణలతో విడిచిపెట్టబడెను. క్రీస్తు వాటినన్ని

టిని ఇష్టముతో భరించియుండెను. నీవు అట్టిసంగతులను భరింపలేక మొరబెట్టుచునావు. క్రీస్తు కొండగాండ్రను విరోధులను గలిగియుండెను. నీవు మనుష్యులందరు నీకు స్నేహితులుగా నుండవలెననిన్ని ఉపకారులుగా నుండవలె ననిన్ని కోరుచున్నావు. శత్రువులను నీవు కలిగి యుండని యెడల నీ యోరిమి కిరీటమును ఎట్లు పొందగలదు. శత్రువులుండుట నీ కిష్టములేని యెడల నీవు క్రీస్తునకు ఎట్లు స్నేహితుడవై యుందువు. నీవు క్రీస్తుతో రాజ్యమేలదలచిన యెడల క్రీస్తుకొరకు క్రీస్తుతో నీవును బాధలను భరింపుము. నీవు ఏసుయొక్క మనస్సులో పూర్తిగా ప్రవేశించి గాఢమైన ఆయనప్రేమను చవిచూచితివేని నీయనుకూల ప్రతికూలములను నీవెంతమాత్రము పాటింపక ఇతరుల తిరస్కారములను భరించుటకు నీకు సమయము దొరికినందుకు నీవు చాలా సంతోషించుదువు. ఎందు చేతననగా ఏసుయొక్క ప్రేమ తన్ను తాను తిరస్కరించు కొనునట్లు చేయుచున్నది. ఏసును, సత్యమును ప్రేమించువాడును మనస్సులో నిజముగా జీవముగలిగి యున్నవాడును మిక్కిలి బలమైన మోహములనుండి విడిచి పెట్టబడిన వాడును స్వేచ్ఛగా తన్నుతాను దేవునివంకకు మరలించుకొని జీవములో తనకంటె తన్ను పైకి లేవనెత్తుకొని ఆనందముతో విశ్రాంతినొందును. పేరునుబట్టియు ప్రఖ్యాతిని బట్టియు సంగతులను విచారింపక వాటి విలువను బట్టి విచారింప గలిగినవాడు నిజముగా జ్ఞానవంతుడు. అట్టివాడు నరునికంటె దేవునియొక్కవగా తెలిసికొన్నవాడు. బహి

రంగపు సంగతులను ఎక్కువైనవని అనుకొనక అంతరంగమున జీవముతో బ్రతుకనేర్చినవానికి మతసాధనముల నెరవేర్చుటకు ప్రత్యేకించిన స్థలమును నియమితమైన కాలమును అక్కర లేదు. జీవముగల మనుష్యుడు యెల్లప్పుడు తన్ను తాను యోచించుకొనుచుండును. ఒకప్పుడైన బహిరంగపు సంగతులచే నాక్రమింపబడడు. బహిరంగపు వ్యాపారములుగాని లేక కాలమునుబట్టి వానికవసరములైయున్న పనులుగాని వాని నడ్డుపెట్టలేవు. ఏసంగతులు తటస్థించినను అతడు వాటికి సరిపడి యుండగలడు. మనస్సునందు చక్కగా నున్నవాడు మనుష్యుని దుర్మార్గప్రవర్తనను లక్ష్యపెట్టడు. మనుష్యుడు ప్రపంచక సంగతులలో తగులుకొన్న కొలదినికలతనొంది బాధపడుచుండును. నీవు మంచివాడవుగా నున్నప్పుడును పాపములనుండి పరిశుద్ధుడవై యున్నప్పుడును నీకు మేలు కలుగుటకు సమస్తమును సమకూడుచుండును. పావనత్వమున అభివృద్ధి చెందగలుగుదువు. అనేక సంగతులు నిన్ను బాధించుచున్నయెడల నీమనస్సు ఇంకను చావనట్టును ప్రపంచక సంగతులకు నీవింకను దూరముగానుండనట్టును యోచించుకొనుము. అపరిశుద్ధమైన మోహముతప్ప నీమనస్సును మరి ఏదియు పాడుచేయలేదు. బహిరంగపు సుఖములను నీవు నిరాకరింపగలిగినయెడల నీవు పరలోకపు సంగతులను ఆలోచించుటకు శక్తి గలిగియుందువు. మరిన్ని అంతరంగముయొక్క ఆనందమును తరుచు నీవు పొందగలుగుదువు.

---

## రెండవ ప్రకరణము.

## దీనత్వము.

ఒకడునీకు అనుకూలముగా నున్నను ప్రతికూలముగా నున్నను నీవు దానిని పాటింపకుము. నీవు ఏమిచేయబోవుచున్నావో దానిని ఆలోచించుకొనుము. నీవు చేయుచున్న ప్రతి కార్యమునందును దేవుడు నీతోనుండుటకు జాగ్రత తీసుకొనుము. మంచిమనస్సును కలిగియుండుము. దేవుడు నిన్ను చక్కగా కాపాడును. దేవుడు కాపాడుచున్న వానిని నరుని దుర్మార్గము హానిచేయలేదు. నీవు మౌనముతో భరింపగలిగినయెడల నీవు దేవుని సహాయమును అనుభవింపగలవు. నిన్ను కాపాడవలసిన సమయమును రీతువును దేవుడెరుగును. కనుక నిన్ను నీవు ఆయనకు విడిచిపెట్టుము. కలతలనుండి మనల రక్షించుటయు మనకు సహాయము చేయుటయు దేవునిపనియైయున్నది. ఇతరులు మన దోషముల నెరిగి మనల చీవాట్లు పెట్టగలుగుటకు మనము దీనులమైయుండుట చాలాలాభకరము. మనుష్యుడు తాను తప్పుచేసినప్పుడు దీనుడైయున్నయెడల ఇతరుల కోపమును సులభముగా శాంతింపజేయగలడు. తన్ను ద్వేషించుచున్న వారినైనను తాను సంతృప్తి పరచగలడు. దేవుడు దీనులకు కృపనిచ్చి రక్షించును. ఆయన దీనులను ప్రేమించి సుఖపెట్టును. దీనులకు చెవియొగ్గును ఆయన దీనులయెడల అపరిమితముగా దయగలిగియుండును. దీనులైయున్న వారిని ఆనందమునకు లేవదీయును. ఆయన దీనులకు తనరహస్యములను తెలియ

జేయును. తనమాధుర్యమును చవిచూపి దీనులనాకర్షించి దగ్గరకు చేరదీసుకొనును. దీనులుముఖము కలతలను భరింపవలసి యున్నను వారిహృదయము సుఖముగా నెమ్మదిగలిగి యుండును. ఎందుచేతననగా ఆతడు ప్రపంచకము నందు విశ్రమింపక దేవునియందు విశ్రమించుచున్నాడు. నీవులందరికన్నను తక్కువగా నున్నట్టు యోచింపగలిగిననే తప్ప నీవాత్మయందభి వృద్ధిచెంది యున్నట్టు యోచింప వీలు లేదు.

## మూడవ ప్రకరణము.

## యోగ్యమైన నెమ్మదిగల మనుష్యుడు.

మొదట నీమనస్సున నీవు నెమ్మదిగలిగి యుండుము. ఆవల నీవితరులకు నెమ్మదిగలగింప గలుగుదువు. బాగాచదువుకున్న పండితునికంటె నెమ్మదిగల మనుష్యుడు యితరులకు ఎక్కువగా మేలుచేయ గలుగుచుండును. కోపోద్రేకముగల మనుష్యుడు మంచిసంగతినికూడ చెడ్డ సంగతిగా మార్చును చెడుగును సులభముగా నమ్ముచుండును. నెమ్మదిగల మంచి మనుష్యుడు అన్నిటిని మంచి సంగతులలోకి త్రిప్పివేయును. మనస్సునందు బాగా నెమ్మదిగలవాడు ఎవరి యందును అపనమ్మకమును గలిగియుండడు మనస్సునందు సంతృప్తి లేనివాడును నెమ్మదిలేనివాడును అనేక అపనమ్మకములతో ఎల్లప్పుడు గందరగోళము పడుచుండును. అట్టివాడు తాను నెమ్మ

దిగా నుండడు. ఇతరులను నెమ్మదిగా నుండనివ్వడు. వాడు చెప్పకూడని సంగతులను తరుచు చెప్పుచుండును. చెప్పవలసిన సంగతులను చెప్పక విడిచిపెట్టుచుండును. తాను చేయవలసియున్న దానిని చేయక ఉపేక్షించి ఇతరులు చేయవలసియున్న దానిని గూర్చి ఆలోచించుచుండును. మొదట నీపట్టుదలను నీమీద నేయుంచుము. తరువాత నీవు దానిని నీపొరుగువానిమీదకు న్యాయముగా వ్యాపింపజేయవచ్చును. నీతప్పితముల నెట్లుదాచి సమాధానము చెప్పవలయునో నీవెరుగుదువు. కాని ఇతరులు చెప్పు సమాదానమును అంగీకరించుటకు నీవిష్టపడవు. నీతప్పితములకు నిన్ను నీవునిందించుకొని నీతోడిమానవుని తప్పితములను క్షమించినయెడల అదిచాలాబాగుండును. నిన్ను నీవు భరింప కోరినయెడల ఇతరుల భారమును కూడా భరించుము. నీవు ధర్మమునకును అణకువకును ఎంత దూరముగానుంటివో చూచుకొనుము. అవినిన్నుతప్పయితరులను నీవుద్వేషించుటకును కోపించుటకును నిన్ను అంగీకరించవు. యోగ్యులమధ్యను శాంతులమధ్యను నెమ్మదిగా కాపరము చేయుట ఒక ఘనకార్యము కాదు. స్వాభావికముగా ఇది అందరికి ఇష్టమైనసంగతే నెమ్మదిగా నుండుట అందరికి ఇష్టమే. తమతో ఇష్టముగా నున్నవారిని అందరు ఆమోదింతురు. కఠినులమధ్యను అల్లరి జనులమధ్యను మోటువారిమధ్యను తమకు ప్రతికూలముగా నున్నవారి మధ్యను నెమ్మదిగా నివశించుట గొప్పకార్యము. మెచ్చుకోతగిన సంగతి. అదియే మగతనము.

తమరు నెమ్మదిగానుండి ఇతరులతో నెమ్మగా నున్న వారు కొందరుకలరు. కొందరు తమరు నెమ్మదిగానుండరు. ఇతరులను నెమ్మదిగా నుండనివ్వరు. అట్టివారు ఇతరులకు భారముగా నుండుటయే గాక తమకు సైతము తమరు ఎక్కువ భారముగా నుందురు. ఇంకా మరికొందరు నెమ్మదిగా తమరు జీవించుచూ ఇతరులనుకూడా నెమ్మదిగానుండునట్లు చేయుటకు ప్రయత్నింతురు. ఈజీవితములో మన నెమ్మదంతయు మనకిష్టములేని సంగతులను తప్పించుకొనుటలో గాక వాటిని అణకువతో భరించుటలో నున్నది. సంగతుల సరిగా ఏలా భరింపవలయునో నేర్చుకొనినవాడు అపరిమితమైన నెమ్మదిని అనుభవింపగలిగి యుండును. అట్టి మనుష్యుడు తన్నుతాను జయించుకొనుచున్నవాడు; ఈయావత్తు ప్రపంచకమునకు అధికారి. క్రీస్తునకు ప్రాణమిత్రుడు. పరలోకమునకు ముఖ్య వారసుడు.

---

## నాలుగవ ప్రకరణము.

## పరిశుద్ధమైన అంతఃకరణము.

మనుష్యుడు రెండురెక్కలవలన ప్రపంచక సంగతుల నుండి పైకి లేవగలుగుచున్నాడు. అవి యేవియనగా నిష్కపటము. పరిశుద్ధత నిష్కపటము. మనభావమునందున, పరిశుద్ధత మన మోహామునందున ఉండవలెను. నిష్కపటము దేవునివంకకు నిదానము గలిగించును. పరిశుద్ధత దేవుని కౌగ.

లించుకొనజేసి ఆయన మాధుర్యమును మనకు చవిచూపును. నీమనస్సునందు నీస్వలాభమును విడిచిపెట్టితివేని మంచికార్య మేదియు నిన్నడ్డుపెట్టదు. దేవుని సంతోషింప జేయుటయు నీపొరుగువానికి మేలుచేయుటయు ఈరెండునుతప్ప ఇక ఇతర సంగతి యేదియు నీమనస్సునందుండని యెడల అంతరంగము యొక్క స్వేచ్ఛను నీవనుభవింపగలవు. నీమనస్సు మంచిదిగా నుండిన యెడల ప్రతిజీవము జీవితముయొక్క అద్దమువలెను పావనములైన సంగతుల నుపదేశించుచున్న గ్రంథమువలెను నీకు గనుపించియుండును.

దేవుని గొప్పతనమును తెలియ జేయని వస్తువేదియు ఈ సృష్టియందు లేదు. వస్తువు ఎంత చిన్న దైనను దేవుని మహిమను వెల్లడించు చున్నది. నీ హృదయము యోగ్యము గాను పరిశుద్ధముగాను ఉన్న యెడల ఏఅభ్యంతరము లేకుండా నీవు అన్ని సంగతులను తెలిసికొనగలవు. పరిశుద్ధమైన హృద యము స్వర్గలోకమును నరకలోకమును చొచ్చి చూడగలదు. తనమనస్సున నున్న యోగ్యతను బట్టి బహిరంగపు సంగతు ల నన్నిటిని యోచింపగలుగు చుండును. ప్రపంచకములో ఆనందమువంటి వస్తువుఏదైనా ఉన్నయడల పరిశుద్ధ హృద యమే దానిని నిశ్చయముగా పొందగలిగి యుండును. ఆపద యెక్కడైనా ఉన్నయడల దానిని చెడుహృదయము మాత్రమె విస్తారముగా అనుభవించు చుండును. నిప్పులో పెట్ట బడిన ఇనుము తుప్పునువిడిచి వేడిమికి తెల్లబడినట్లు మనుష్యుడు పూర్తిగా దేవునిలో ప్రవేశించినప్పుడు పాపమును విడిచి

ప్రొత్తమనుష్యుడగుచున్నాడు. మనుష్యుడు అశ్రద్ధగానుండుట కు ప్రారంభించినది మొదలు శ్రమకుభయబడి బహిరంగపుడుప శాంతులకు శరణుజొచ్చుచుండును. మనుష్యుడు ఒకప్పుడు పూర్తిగా తన్నుతాను జయించుకొని ధైర్యముతో దేవుని మార్గమున నడిచినయెడల అంతకుముందు తనకు కష్టముగాను బాధగాను కనుపించియున్న సంగతులు సుఖముగాను తేలికగాను గనుపించును.

## అయిదవ ప్రకరణము.

## అహంభావత్వమునుగూర్చి యోచించుట.

మనలమనము యెక్కువగానమ్మి మనమీాద ఆధార పడుటకు వీలులేదు. ఎందుచేతననగా మనము తరుచు దేవుని అనుగ్రహమును, జ్ఞానమునుతొలగియుందుము. మనయందు తెలి వికొంచెమున్నది. కాని దానిని సైతము అలక్ష్యముచేత మనము పోగొట్టుకొనుచున్నాము. లోపల మనమెంతగుడ్డివారమైయు న్నదీ మనము తరుచు కనిపెట్టలేక పోవుచున్నాము. మనము తప్పుచేసినప్పుడు దానిని మరుగుచేయుటకు మరింత తప్పు సమాధానములను చెప్పుచుందుము. మనముకొన్ని సమయము లయందు కామోద్రేకముగా సంచరించి అదిఉత్సాహమనిఅను కొందుము. ఇతరులయందున్న స్వల్పదోషములకు వారిని మన ము చీవాట్లు పెట్టుదుము. మనయందున్న గొప్పలోపములను మనము లక్ష్యముచేయము.

ఇతరులనుండి మనము కొంచెము భరింపవలసి వచ్చినప్పుడు మనము చాలావ్యసనపడి మరిచిపోక దానినియోచించుచుందుము కాని ఇతరులు మననుండి ఎంత బాధపడుచుండిరో ఆసంగతిని మనమెంతమాత్రము ఆలోచించము. తాను చేయుచున్న పనులను సరిగా యోచించుకొనగలిగినవాడు ఇతరుల కార్యములను కఠినముగా యోచింపలేడు. మనస్సున జీవము గలవాడు ఇతరములన్నిటికన్నను ముఖ్యముగా తన ఆత్మను గూర్చి జాగ్రతతీసుకొనును. తన్నుగురించి తాను జాగ్రత తీసుకొనుచున్నవాడు ఇతరులనుగూర్చి ఎంతమాత్రము మాటాడక మౌనముగానుండును. ఇతరులనుగూర్చి నీవు మౌనముగా నుండనప్పుడును నిన్నుగూర్చి తగినంత శ్రద్ధతో నీవు జాగ్రత తీసుకోలేనప్పుడును నీవు జీవములోనున్న మనుష్యుడవు కానేరవు. నిన్నుగూర్చియు దేవునిగూర్చియు తగిన జాగ్రత తీసుకొనుచున్నప్పుడు బహిరంగపు సంగతులు నిన్ను కొంచెమైనను బాధింపలేవు. నీవు నీలోనుండనియెడల ఇక ఎక్కడ ఉందువు? నిన్ను నీవు ఉపేక్షించి ఎక్కడికి పరుగెత్తినా ఏమి లాభము? చిత్తశాంతి గలిగియుండుటకును దేవునితోచేరియుండుటకును నీవు కోరినయెడల తక్కినసంగతులనన్నింటిని విడిచి నీయాత్మ జీవితమునుమాత్రమే చూచుకొనుము. అస్థిరపదార్థముల నాశింపకుండిన యెడల నీవు విస్తారముగా అభివృద్ధినొందగలుగుదువు. అస్థిరములైన వస్తువులు విలువగలిగినవని యెంచుకొంటివేని నీయభివృద్ధిని చెడగొట్టుకొన్నవాడవగుదువు. దేవుని సంబంధమైన దానినితప్ప మరియేవస్తువులును గొప్పదని

యోచింపకుము. మరిదేనిని హెచ్చైనదని భావింపకుము. ఇక దేనికి ఆనందింపకుము. దేనినిఅంగీకరింపకుము. నీవుజీవులనుండి పొందుచున్న సుఖము వ్యర్థమైనదని యోచించుము. దేవుని ప్రేమించుచున్న ఆత్మ దేవునికంటె తక్కువ వస్తువులనన్నిటిని తిరస్కరించును. దేవుడొక్కడుమాత్రమే శాశ్వతమైన వాడు. అఖండమైనవాడు. గొప్పవాడు. సకలజీవులయందు ప్రకాశించు చున్నవాడు. ఆత్మయొక్క ఉపశాంతి. హృదయముయొక్క నిజమైనఆనందము.

---

## ఆ ర వ ప్ర క ర ణ ము .

## మంచిహృదయము యొక్క ఆనందము.

మంచి మనుష్యుని యొక్క ఆనందము అంతరాత్మ యొక్క సాక్ష్యము మీద ఆధారపడి యున్నది. మంచిహృదయము విస్తారముగా భరింపగలుగు చున్నది. కష్టములయందు ఆనందముగా నుండగలుగు చున్నది. చెడుహృదయము ఎల్లప్పుడు భయము గలిగి ఒకప్పుడైనా నెమ్మది లేక యుండును. నీమనస్సు నిన్ను చీవాట్లుపెట్టని యెడల నీవు హాయిగా విశ్రమించుదువు. నీవు చక్కగా పనిచేసినప్పుడు తప్ప నీవెప్పుడు సంతోషింపకుము. దుర్మార్గు లెప్పుడు నిజమైన ఆనందమును గలిగియుండ నేరరు. వారు హృదయశాంతి నైనను అనుభవింపలేరు "భక్తిహీనులకు శాంతిలేదని" ప్రభువు సెల విచ్చుచున్నాడు. 'మేము శాంతిగలిగి యున్నాము మాకేమి కీడు కలుగుట లేదు. మాకుహాని చేయుటకు ఎవరు సాహసించు

గలరు?" అని దుర్మార్గులు చెప్పిన యెడల నీవు దానిని విశ్వ సింపకుము. ఏలయనగా అకస్మాత్తుగా దేవునికి వారి మీద కోపము గలిగి వారికార్యముల వ్యర్థము చేయును. వారి ఊహాలను నశింపుచేయును. ప్రభువును ప్రేమించుచున్న వారు కష్ట సమయములలో ఆనందింప గలుగుట కఠినమైన సంగతి కాదు. ప్రభువైన యేసు క్రీస్తు సిలువయందు అతిశయించెడి ఆనందమే ఆనందము. మనుష్యులనుండి పొందబడుచున్న ఆనందము మిక్కిలి అల్పమైనది. ప్రపంచకము యొక్క ఆనందము ఎల్లప్పుడు దుఃఖముతో వెంబడింప బడుచుండును. యోగ్యులయొక్క ఆనందము వారి హృదయము లందుండును. కాని మనుష్యుల నాలుకలలో నుండదు. యోగ్యుల ఆనందమే దేవుని ఆనందము. వారు దేవునియందే ఆనందించుచుందురు. వారి సంతోషము సత్యము యొక్క సంతోషము. నిజమైన శాశ్వతానందమును గోరువాడు అశాశ్వతములైన వాటికి ప్రయత్నింపడు. అశాశ్వతమైన ఆనందము నిమిత్తము ప్రయత్నించిన వాడును అశాశ్వతమైన ఆనందమును అసహ్యంపని వాడును పరలోకముయొక్క ఆనందమును తక్కువగా ఎన్నినవాడగును. మనుష్యులయొక్క నిందలను స్తుతులను లక్ష్యము చేయని వాడు విస్తారమైన హృదయ శాంతిని అనుభవింప గలుగును.

ఎవడు పరిశుద్ధమైన హృదయమును గలిగియుండునో అతడు సులభముగా సంతృప్తినొంది శాంతించును. నీవు ఇతరులచే మెచ్చుకోబడినంత మాత్రముచేత ఎక్కువ పరిశుద్ధుడవుకావు. ఇతరులచే దూషింప బడినంత మాత్రముచేత

ధూర్మార్గుడవు కావు. నీవు నీవే. దేవుడు నీయందు చూచిన దానికంటె ఇతరులు చెప్పుచున్న దానివలన నీవెన్నడు మంచి వాడవు కావు. నీవు నీలోపల యేలాగునఉంటివో ఆలోచించు కొన్న యెడల నిన్ను గురించి మనుష్యులు ఏమని చెప్పుకొనుచు న్నారో అని వినుటకు నీవు ప్రయత్నించవు. మనుష్యుడు ముఖ మును చూచును. దేవుడు హృదయమును చూచును. ఎల్ల ప్పుడు మంచి చేయుచుండుటయు అందరి కన్నను తాను "తక్కువ" అని ఎన్నుకొనుటయు ఆత్మయొక్క అణకువకు గురుతని తెలుసుకొనుము. జీవులనుండి ఉపశాంతిని కోరకుం డుట హృదయము యొక్క పరిశుద్ధత్వమునకును మనస్సు యొక్క విశ్వాసమునకును గుర్తని తెలిసికొనుము. ఇతరుల వల్ల మెచ్చుకోబడవలెనని ప్రయత్నింపని మనుష్యుడు తన్ను తాను పూర్తిగా దేవునికి వశపరిచి యుండుట యథార్థము. "ప్రభువు మెచ్చుకొనువాడే యోగ్యుడు కాని తన్ను తానే మెచ్చుకొనువాడు యోగ్యుడు కాడు" అని ధన్యుడైన పౌలు చెప్పెను. మనస్సునందు దేవునితో నడచుచుండుటయు ప్ర పంచక సంగతులనుండి మనస్సును విడిపించుకొనుటయు, జీవ ములో ప్రవేశించిన మనుష్యుడు పొందదగిన స్థితిగానున్నది.



## ఏడవ ప్రకరణము.

## ఏసును అన్నిటికంటెను ఎక్కువగా ప్రేమించుట.

ఏసును ప్రేమించుటఎట్టిదో తెలిసినవారును ఏసుకొరకు తమ్ముతాము తిరస్కరింప తెలిసినవారును నిజముగాధన్యులు. నీవు మిక్కిలిగా ప్రేమించుచున్నవానికి నీవు ప్రేమించుచున్న దానిని విడిచిపెట్టుము. ఏలయనగా ఏసు అన్నిటికంటె తాను ముఖ్యముగా ప్రేమింపబడవలెనని కోరుచున్నాడు. సృష్టింపబడిన వస్తువులయొక్క ప్రేమ మోసమైనది. స్థిరముకానిది. ఏసుయొక్క ప్రేమవిశ్వాసకరమైనది. చలనములేనిది పడిపోయెడివస్తువులనంటి పట్టుకున్నవాడు వాటితో కలసి క్రిందకు పడిపోవును. ఏసును కౌగలించుకున్నవారు ఆయనను స్థిరముగా నంటిపట్టుకొని ఎప్పటికిని నిల్చియుందురు. నీవు ఆయనను ప్రేమించుము. ఆయనతో స్నేహించుము ఇతరస్నేహితులందరు నిన్ను విడచి వెళ్ళినను ఆయన నిన్ను విడిచిపెట్టక నీ ప్రక్కనునిలచి అంత్యకాలమునందైనను నిన్ను నాశనము కానివ్వక కాపాడుచుండును. నీకు ఇష్టమున్నను లేకున్నను ఎప్పుడో ఒకరోజున నీవు అన్నిటిని విడిచిపెట్టవలసియుందువు. జీవితకాలమునందున మరణమునందున ఏసును విడిచిపెట్టక నీదగ్గిర నుంచుకొనుము. విశ్వాసకరమైన ఆయనజాగ్రతకు నిన్ను నీవు ఒప్పగించుకొనుము. నీ స్నేహితులు నీకు సహాయము చేయకపోయినను ఆయన ఒక్కడు మాత్రము నీకుతప్పక సహాయము చేయును. మిగుల ప్రేమాస్పదమైన నీప్రభువు విస్తారమైన దయాస్వభా

వముగలవాడు. కనుక ఆయన ఇతరులతో కలసి నీ హృదయ
మును పాలుపంచుకొనడు. దానినంతయు ఆయన ఒక్కడు
మాత్రమే గైకొనును. ఆయన దానిలో తన సింహాసనమున
కూర్చుండును. నీవీసృష్టి పదార్థముల నన్నిటిని విడిచిపెట్టిన
యెడల ఆయన నీతో నివసించును. క్రీస్తునువిడిచి మనుష్యుని
ఆశ్రయించుటవలన నీవు నష్టపోవుటయేగాని మరియొకటికాదు
గాలికి కదులుచున్న రెల్లుపుల్లను నమ్మి దానిమీద ఆధారపడి
యుండకుము. ఈ శరీరమంతయు గడ్డివంటిది. దాని ఆనంద
మంతయు పొలములో పువ్వువలె వాడిపోవును. నీవు మను
ష్యులయొక్క పైరూపములను మాత్రమే చూచినయెడల నీవు
త్వరలో మోసపోదువు. నీవు ఇతరులనుండి లాభము పొంద
కోరినను తరుచు నీవు నష్టపోవుచుందువు. నీవు అన్నిసంగతు
లలోను ఏసుకొరకు ప్రయత్నించిన యెడల నిశ్చయముగా
ఏసునుకనిపెట్టగలవు. మనుష్యుడు ఏసుకొరకు ప్రయత్నించని
యెడల ఈ యావత్తు ప్రపంచకముకంటెను అందరి శత్రువుల
కంటెను తనకు తాను ఎక్కువగా హాని చేసికొనినవాడగును.

## ఎనిమిదవ ప్రకరణము

## ఏసుయొక్క-మైత్రి.

ఏసు నీతోనున్నప్పుడు సమస్తము అనుకూలముగానే
యుండును. ఏసంగతి నీకుకష్టముగా కనుపించదు. ఆయననీతో
లేనప్పుడు ప్రతిసంగతి నీకు కష్టముగా తోచును. ఏసు నీమ

నస్సులోపల నీతో సంభాషింపని యెడల ఇతర సుఖముల న్నియు వ్యర్థమగుచుండును. యేసు నీతో ఒక్కమాట మాట్లాడి నప్పుడు నీవెంత గొప్ప ఉపశాంతిని బొందుదువు! "గురువు వచ్చి నిన్ను పిలుచుచున్నాడ" ని మార్తవచ్చి చెప్పినప్పుడు మరియ తానుశోకించుచున్న స్థలమునుండి వెంటనే లేవలేదా? కన్నీళ్ళనుండి యేసునిన్ను ఆత్మానందమునకు బిలిచినప్పుడు అది నీకు ఎంతహాయిగానుండును! నీవు యేసును విడిచియున్నప్పుడు అదినీకెంతకఠినముగా గనుపించుచుండును. యేసును విడిచిపెట్టి నీవుమరియొక ఇతరవస్తువునుకోరుట ఎంతతెలివి హీనత! అది ఎంత వ్యర్థమైన సంగతి! అది యీ ప్రపంచకము నంతటిని పోగొట్టుకొన్న దానికంటె ఎక్కువ నష్టముకాదా? యేసును నీవు పోగొట్టుకొన్నప్పుడు ఈ ప్రపంచకమంతను నీవు కలిగి యుండిన మాత్రమున యేమిలాభము? క్రీస్తును విడిచిపెట్టియుం డుటయే దారుణమైన నరకము. యేసుతోనుండుట స్వర్గములో నుండుట. నీవు యేసుతో నున్నప్పుడు యేశత్రువుడు నీకు హాని చేయలేడు. యేసును సంపాదించుకొన్నవాడు గొప్ప ధనమును సంపాదించినవాడు. ఆధనము అన్నిధనముల కంటెను గొప్పది. యేసును పోగొట్టుకొన్నవాడు అంతటిని పోగొట్టుకొన్నవాడు. ప్రపంచకము నంతటిని పోగొట్టుకొనుటకంటె కూడా అది ఎక్కువనష్టము. యేసును విడిచిపెట్టి బ్రతుకుచున్నవాడు. పరమదరిద్రుడు. యేసును స్నేహితునిగా గైకొన్నవాడు బహు భాగ్యవంతుడు. యేసుతో యేలాగున మాట్లాడవలెనో తెలిసి కొన్నవాడు గొప్పనేర్పుగలవాడు. యేసును మనస్సునందు యేలా

గున నిలుపుకొనవలెనో తెలిసినవాడు గొప్ప జ్ఞానవంతుడు. నీవు ధన్యుడవై శాంతిగలిగి యుందువు. అప్పుడు యేసు నీతో నుండును. నీవు భక్తివిశ్వాసములుగలిగి నెమ్మదితోనుందువు. అప్పుడు యేసు నీతో నిలిచియుండును. నీవు ప్రాపంచిక వస్తువుల వంకకు తిరిగిన యెడల యేసును నీతో నుండి వెళ్లగొట్టుకొని ఆయనను పోగొట్టుకొందువు. ఆయనను నీవు పోగొట్టుకొనినయెడల ఆవల నీవెవని యొద్దకు పరుగెత్తుదువు? ఎవనితో స్నేహము చేయుదువు? నీవు స్నేహితుడు లేనిదే బ్రతుకలేవు. నీకు స్నేహితు లందరికంటెను యేసు ఎక్కువగా నుండినయెడల నీవు నిశ్చయముగా సంతోషించుదువు. నీవు యేసుయందుగాక ఇతరసంగతియందు సంతోషించినను, ఇతర సంగతియందు నమ్మకముంచినను వైరివానివలె సంచరించినవాడవగుదువు. యేసును నీపై కోపింపజేయుటకంటె ఈ ప్రపంచకమంతటితోను నీవువిరోధముగా నుండుటయే మంచిది. కనుక అన్నిటికంటెను ముఖ్యముగా యేసు ఒక్కడు మాత్రమే మనకు ప్రియముగా నుండవలెను.

అన్నిటిని యేసునిమిత్తముమాత్రమే ప్రేమించుము. యేసును యేసునిమిత్తము ప్రేమించుము. యేసుక్రీస్తు ఒక్కడుమాత్రమే విస్తారముగా ప్రేమింపబడవలసియుండును. అందరుస్నేహితులకంటెను యేసుక్రీస్తు ఒక్కడుమాత్రము మిక్కిలి విశ్వాసముగలిగియున్నట్టును మంచివాడుగానున్నట్టునుకనిపెట్టుము. ఆయనయందును ఆయననిమిత్తమును మనము స్నేహితులను విరోధులను ఒకటే విధముగా ప్రేమించవలసి యున్నాము. వారంద

రు ఆయనను తెలిసికొని ఆయనను ప్రేమించుటకు మనము వారందరినిమిత్తము దేవుని ప్రార్థింతము. నీవు ఎవనిని విస్తారముగా పొగడుటకును ప్రేమించుటకును కోరకుము. ఏమనగా అది దేవునికి మాత్రమె చెందవలసిన సంగతి. ఆయనకు సమానమైనవాడు ఎవడును లేడు. నిన్ను ఎక్కువగా ప్రేమించుటకు ఎవనిని కోరవద్దు. ఎవనిని నీవు ఎక్కువగా ప్రేమించవద్దు. నీవును యోగ్యులైన ఇతర మనుష్యులును ఏసు నేహృదయమునందు ప్రేమింపకోరుచుండుడు. ఏజీవమునందును విపరీతమైన మోహమును గలిగియుండక మనస్సునందు స్వేచ్ఛగలిగి పరిశుద్ధముగా నుండుము. నీవు శాంతిగలిగియుండ కోరినయెడలను ప్రభువుయొక్క మాధుర్యమును రుచిచూడగోరినయెడలను నీహృదయమును దేనిని అంటనివ్వక పరిశుద్ధముగా నుంచుకొని ఏసుదగ్గరకు తీసుకురమ్ము. దేవునియనుగ్రహమును నీవు పొందలేనియెడల నీవు ఆలాగున యెన్నడు చేయలేవు. దేవుని అనుగ్రహమును నీవు పొందినప్పుడు నీవు సర్వమును విడిచిపెట్టి నీవు ఒక్కడవు దేవుని ఒక్కనితోకూడి యుండగలవు. దేవుని అనుగ్రహము దొరికినప్పుడు మనుష్యుడు అన్ని కార్యములను చేయగలడు. దేవుని అనుగ్రహము పోగొట్టుకొన్నప్పుడు అతడు వట్టి నిర్భాగ్యుడై, బలహీనుడై కష్టములనుభరించుటకు బ్రతికి యున్నట్టు కనుపించును. అట్టిసమయములందు నీవు నిరాశజెంది కృశింపకూడదు. ఏసుక్రీస్తును మహిమచేయుటకు నీకేమి తటస్థించినను నెమ్మదిగా భరించ గలుగుటకు దేవుని ఇష్టమును అనుసరించుచుండుము. ఎందు చేతననగా శీతకాలము గతించిన

తోడనే వేసవికాలము తటస్థించును. పగలు వెళ్ళినతోడనే రాత్రివచ్చును. తుపానుపోయిన తోడనే నెమ్మది గలుగును.

---

## తొమ్మిదవ ప్రకరణము.

## ఉపశాంతి లేకయుండుట.

దేవుని ఉపశాంతిని పొంది యున్నప్పుడు నరుని ఉపశాంతిని తిరస్కరించుట ఒక ఘన కార్యము కాదు. నరుని ఉపశాంతి, దేవుని ఉపశాంతి యీరెండూ కూడా లేనప్పుడు సహించియుండుట చాలా గొప్ప సంగతి. దేవుని మహిమపరుచుటకు హృదయముయొక్క భ్రష్టత్వమును ఇష్టముతో సంతోషముగా భరించుటయు ఒకప్పుడైనా అహంభావమును పొందకుండుటయు తన ఆధిక్యతను యోచింపకుండుటయు చాలాగొప్పసంగతులు. దేవునిఅనుగ్రహము సమీపింపబోవుచున్నప్పుడు నీవు ఆనందమును భక్తిగలిగి యుండుట ఏమి గొప్పసంగతి! సర్వశక్తుడైన దేవునివలన నడుపబడుచున్నంత వరకు భారముతోచకుండుటఏమి ఆశ్చర్యము? ప్రభువు వానికి త్రోవచూపుచున్నంత వరకు వానికి ఏమి లోపముండును ?

సుఖము కొరకు మన మెల్లప్పుడు ఏదో ఒక దానిని కోరుచుందుము. మనుష్యుడు కష్టపడకుండా స్వాభిమానమును విడిచిపెట్టలేక పోవుచున్నాడు. మతము కొరకు ప్రాణముల విడిచిపెట్టిన లారెన్సు అనుఅతడు తనగురువుతో ప్రపంచకమునంతియు జయించెను. ఎందుచేతననగా ప్రపంచకములో

సంతోషముగా కనుపించిన దానినెల్ల అతడు తిరస్కరించెను. అతడు విస్తారముగా ప్రేమించి యున్న సిక్స్టస్ను (Sixtus) అను ప్రధానగురువు ఆయననుండి తొలగింపబడినప్పుడు సహా ఏసు మీద ప్రేమచే అతడు భరించియుండెను.

అతడు సృష్టికర్తమీద ప్రేమచే మనుష్యునిమీది ప్రేమను జయించెను అతడు నరుని ఉపశాంతి ననుభవించుటకంటె దేవుని కిష్టమైన దానిని చేయుటకు కోరెను. నీవుకూడా దేవునిమీది ప్రేమచే దగ్గిర బంధువునిగాని ప్రియమైన స్నేహితునిగాని విడిచిపెట్ట గలుగుటకు నేర్చుకొనుము. ఏస్నేహితునివల్లనైనను నీవు విడిచిపెట్ట బడవలసివచ్చినప్పుడు నీవందుకు విచారింపకుము. ఏందుచేతననగా తుదకు మనమందరము ఒకరినొకరము విడిచిపెట్టవలసినవారమె. తన్ను తాను పూర్తిగా జయించి తన హృదయమును దేవుని కర్పించుటకు ముందు మనుష్యుడు తనతో తానుదీర్ఘకాలము బలముతో పోరాడవలసియుండును. మనుష్యుడు తనమీద ఆధారపడినప్పుడు నరుల యుపశాంతులలో సులభముగా ప్రవేశించుచుండును. క్రీస్తుమీద నిజమైన ప్రేమగలవాడును యోగ్యత కొరకు శ్రద్ధతో ప్రయత్నించువాడును ఆ ఉపశాంతులలో చిక్కనేరడు. శరీరసుఖముల నెంతమాత్రము ఆశించడు. క్రీస్తు కొరకు ఎట్టికష్టములనైనను పరితులనైనను భరించును. దేవునివలన నీ ఆత్మకు ఉపశాంతి దయచేయబడినప్పుడు దానిని కృతజ్ఞతతో గైకొనుము. అది నీప్రజ్ఞవలన లటస్థించినట్లు భావింపక అది దేవునివలన నీకివ్వబడినట్లు తెలిసికొనుము. ఆ

దేవుడిచ్చినదానికి నీవు ఉప్పొంగి గర్వింపక ఎక్కువ అణకువ గలిగి నీవుచేయుచున్న అన్ని పనులలోను దానిని జ్ఞప్తికి తెచ్చుకొనుచు జాగ్రతగానుండుము.

ఎందుచేతననగా ఆసమయము గతించవచ్చును. శోధన పెంబడించ వచ్చును. ఆఉపశాంతి తొలగింపబడినప్పుడు నీవు వెంటనే నిరాశజెందకుము. దేవుని అనుగ్రహము కొరకుఓర్పుతో పరీక్షించియుండుము. అంతకన్న ఎక్కువ ఉపశాంతిని మరలనీకు దయచేయుటకు దేవుడు సమర్థుడు. దేవుని మార్గమునందు అనుభవము గలవారికిది క్రొత్తదియు ఆశ్చర్యమైనదియు కాదు. గొప్పమహాత్ములును పూర్వకాలపు ప్రవక్తలును ఇట్టి అవస్థాంతరములను అనేకమారు లనుభవించిరి. ఆకారణముచేతనే దేవుని ఉపశాంతిననుభవించుచున్నప్పుడు " నేనెన్నడు కదలనని నాక్షేమకాలమున ననుకొంటిని " అని ఒకడు చెప్పెను. ఆక్షేమకాలము గతించిన తరువాత ఆతడు తనయందు కనిపెట్టినదానిని ఈవిధముగా జెప్పుకొనుచుండెను.

" ఓసర్వేశ్వరా ! నీముఖమును నీవు దాచుకొనినప్పుడు నేను క్షోభిల్లితిని " ఈ కలత మధ్యను ఆతడొంత మాత్రము చలించలేదు. గాఢమైన భక్తితో ప్రభువు నిట్లు ప్రార్థించుచుండెను. " సర్వేశ్వరా నీకే నే మొరబెట్టితిని. నాప్రభువును బ్రతిమాలుకొంటిని." తుదకు తన ప్రార్థనయొక్క ఫలమును పొంది తన మొర ఆలకింపబడినట్టు రుజువు చేయుచు " దేవుడు నా మొరాలకించి నన్ను కరుణించెను. సర్వేశ్వరుడు నాకు సహాయుడుగా నున్నాడు " ఎట్లు ? ఆతడుమరల

చెప్పుచున్నాడు. "నాదుఃఖమును సంతోషముగా మార్చితివి. దయతో నన్ను కరుణించితివి" మహాత్ములందరు ఈ విధముగా నున్నప్పుడు దుర్బలులమైన మనము కొన్ని సమయముల యందు భక్తిగలిగి యున్నందుకును కొన్ని సమయముల యందు భక్తిలేక మాంద్యులమై యున్నందుకును మనము నిరాశ జెంద నవసరములేదు. ఎందుచేతననగా జీవము మనకు భగవంతుని ఇష్టమునుబట్టి వచ్చుచూపోవుచుండును. ఈకారణముననే ధన్యుడైన యోబు చెప్పుచున్నాడు "ప్రతియుదయము నను నీవు వానినిదర్శించి అకస్మాత్తుగా వానిని శోధించుచున్నావు"

దేవుని అనుగ్రహమునందు తప్ప ఇకనేనెక్కడ ఆశించగలను? నేనునానమ్మికనంతను దేనిలోనుంచగలను ? నేను నాతో అనేక యోగ్యులను కలిగియున్నను, నేనుభక్తిగలిగిన సోదరులను కలిగియున్నను, విశ్వాసముగల స్నేహితులను కలిగియున్నను, నావద్ద అనేక సద్గ్రంథములున్నను మధురములైన కీర్తనలున్నను దేవునిదయ తొలగియున్నప్పుడు ఇవి యేమియు నాకు సహాయముచేసి తృప్తిగలిగింపలేవు. ఇవి అన్నియునన్ను నిర్భాగ్యునిగా విడిచిపెట్టుచున్నవి. అట్టిసమయములో ఓర్పుగలిగి దేవుని ఇష్టమునకు పూర్ణముగా లోబడియుండుట తప్ప ఎక్కువైన పరిహారమేదియు లేదు. కొన్ని సమయములయందైనను దేవుని అనుగ్రహమును పోగొట్టుకొనని మతస్థునిగాని భక్తి తగ్గిపోవని మతస్థునిగాని నేనింతవరకెన్నడును చూచియుండలేదు. ప్రారంభము మొదలు చివరవరకు ఒకప్పుడైన

శోధనల నెరుగనంత జ్ఞానముగలిగిన మహాత్ముడైనను నేను చూచియుండ లేదు. దేవునినిమిత్తము కష్టముల భరింపనివాడు దేవుని గాఢముగా ధ్యానించుటకు అర్హుడుకాడు. ఉపశాంతికి ముందు కష్టములును బాధలును తటస్థించుట తరుచు జరుగు చున్న సంగతే. అవి ఉపశాంతి సమీపింప బోవుచున్నందుకు గుర్తు. శోధనలచే రుజువుచేయబడిన వారికి పరలోక సుఖము వాగ్దత్తము చేయబడును ,,జయించువారికి దేవుని పరదైసులో నున్న జీవవృక్షఫలముల తిననిత్తును" అని ఆయన చెప్పెను. కష్టములను భరించుటకొరకు ధైర్యము కలిగియుండుటకై దేవుని యుపశాంతి అనుగ్రహింపబడుచున్నది. తాను జీవమును కలిగియున్నందుకును అభివృద్ధి జెందుచున్నందుకును గర్వింపకుండా ఉండుటకు శోధనలు వెంబడించు చుండును. మీవిరోధియైన సాతానుగర్జించుచు నిద్రపోక ఎవరిని మ్రింగుదునాయని తిరుగు చున్నాడు. ఇంద్రియ వికారములైనను ఇంతవరకు చావలేదు. కనుక యుద్ధమునకు నీవు నిన్ను సిద్ధముగా నుంచుకొనకవిడిచి పెట్టకుము. ఏలయనగానీకుడివైపునను ఎడమవైపునను నీశత్రువులు విశ్రాంతి లేక యున్నారు.

---

# పదియవ ప్రకరణము.

## దేవుని దయకు కృతజ్ఞుడైయుండుట.

నీవు శ్రమ అనుభవించుటకు పుట్టినప్పుడు ఏలవిశ్రాంతిగా నుండ గోరెదవు. నీవు సుఖ మనుభ వించుట కంటె ఓర్పుగలిగి యుండుటకు ప్రయత్నింపుము. ఆనందించుట కంటె సిలువను భరించుటకు ప్రయత్నింపుము. ఆత్మ సుఖమును ఆనందమును తానెల్లప్పుడు అనుభవించగలిగిన యెడల వాటిని అనుభవించుటకు సంతోషింపని వాడు ఎంత విచిత్రమైన మనుష్యుడు! ఏలననగా ఆత్మ సుఖము ప్రపంచక సంబంధములైన అన్ని ఆనందముల కన్నను, ఇంద్రియ భోగముల కన్నను మిగుల ఎక్కువైనది. ప్రపంచక సుఖములన్నియు అపకీర్తికరములైనవి. వ్యర్థమైనవి. ఆత్మసుఖములు మాత్రమే మధురమైనవి. కీర్తిగలిగించునవి. యోగ్యతమూలమున పొందబడునవి. దేవునివలన పవిత్రహృదయముల యందు పూరింపదగినవి. ఒకడైన దేవుని యుపశాంతులను తన ఇష్టప్రకారము ఒకటేవిధముగా ఎల్లప్పుడు అనుభవింప లేడు. ఎందుచేతననగా శోధనలనుండి ఆతడుపొందియున్న స్వేచ్ఛచాలా కాలము నిలిచియుండ లేదు. మనస్సు యొక్క స్వాతంత్రియములధికమైన స్వశక్తి నమ్మకము దేవుని ఉపశాంతులకు విరోధములై యున్నవి. దేవుడు తన ఉపశాంతుల ననుగ్రహించుటలో చాలా సదుపాయము చేయుచున్నాడు. కాని మనుష్యుడు వెంటనే వాటినన్నిటిని కృతజ్ఞతతో దేవునికి సమ

ర్పింపక చెడ్డవాడగుచున్నాడు. ఈ కారణము చేతనే అను గ్రహముతో దయచేయబడిన ఈవులు మన వంకకు ప్రవహించుటలేదు. ఎందుచేత ననగా వాటిని మనకు దయచేసిన దేవునియెడల మనము విశ్వాసహీనులమై యున్నాము.

మనము వాటినితిరిగి మరల వాటిమూలములోకి ప్రవహింప జేయుటలేదు. ఎవడుతనకు దేవుడు దయచేసియున్న దానికి కృతజ్ఞుడై యుండునో వానిసమాత్రమే ఆ అనుగ్రహింపబడిన ఈవి ఎల్లప్పుడు విడిచిపెట్టకుండును. గర్విష్ఠుల నుండి అది తొలగింపబడి దీనులకు దయచేయ బడుచుండును. అనుతాపమును మనస్సునుండి తొలగించెడి ఉపశాంతిని నే నెన్నడుకోరను. గర్వముగలిగించెడి ప్రార్థనయొక్క బలము సైతమునాకక్కరలేదు. హెచ్చుగా నున్నంత మాత్రముచేత ప్రతివస్తువు పవిత్రమైనదికాదు. ప్రతికోరిక పరిశుద్ధమైనది కాదు. మనకిష్టమైన ప్రతిసంగతి దేవునికి ప్రియమైనది కాదు. నాకింతకన్న ఎక్కువ అణకువను గలుగజేయునట్టిన్ని పావనమైన భయమును గలిగించునట్టిన్ని ఇంతకన్న యెక్కువ ఇష్టముతో నన్ను నేనువిడిచిపెట్టునట్లు చేయగలుగునట్టిన్ని అనుగ్రహమునుమాత్రము నేను కోరుదును. భక్తియు దానిని చెడ గొట్టుచున్న మరియొక విపరీతాభిప్రాయము యీ రెంటిని గూడా గలిగియున్న వానికి కొంచెమైనను లాభ మున్నదని చెప్పుటకు వీలులేదు. అట్టివానిని వ్యర్థుడని చెప్పవలసి యుండును. దేవునికి చెందియున్న దానిని దేవుని కిచ్చివేయుము. నీ స్వంతమైన దానిని నీకు ఆరోపించుకొనుము. అనగా ఆయన

అనుగ్రహమునకు వందనముల చెల్లింపుము. పాపమునుఅందుకు తగిన శిక్షను నీకారోపించుకొనుము. నీ వెల్లప్పుడును కడపటి చోటునకూర్చుండుము. అపుడుఅందరికన్నను హెచ్చైనచోటు నీకివ్వబడును. ఎందుచేతననగా తక్కువచోటు లేనిదే హెచ్చు చోటు నిలవబడదు. దేవునిముందు హెచ్చుగానున్న మహాత్ము లందరు తమదృష్టికి తాముతక్కువగానున్న వారే. వారుఎక్కువగా ప్రకాశించుచున్న కొలదినిమనస్సునందు ఎక్కువ అణకువగలిగియుండిరి. సత్యముతోను పరలోకసంబంధమైన ఆనందముతోను పూర్ణముగా నిండియున్నవారు వ్యర్థములైనఆనందములను వాంఛింపరు. దేవునియందు గట్టిగా స్థిరపడియున్నవారు ఎంత మాత్రము గర్వింపరు. వారికేమి మేలు గలిగినను దానిని దేవుని కారోపించుచుందురు. వారు ఇతర ఆనందముల కొరకు ప్రయత్నింపరు. దేవుని వలన గలిగెడి ఆనందము నిమిత్తమే వారెల్లప్పుడు కోరుచుందురు. వారన్నిటికంటెను ముఖ్యముగా దేవుడు ఆయన భక్తులయందు మహిమ కనుపరచబడవలెనని కోరుచుందురు. వారు చేయుచున్న ప్రతి కార్యములయందు వారి మనస్సులో ఈ నిధానమునే కలిగియుందురు. నీకు తక్కువమేలు గలిగినప్పుడు కూడా నీవు కృతజ్ఞుడవై యుండుము. అప్పుడు నీవు గొప్పమేళ్లను పొందుటకు అర్హుడవగుదువు. అదిఎంత స్వల్పముగా నున్నను గొప్పదిగా నున్నట్టు తలంచుము. పైకి తృణీకారముగా గనిపించుచున్న ఈవి ప్రత్యేకించిన విలువగలిగి యున్నదని తెలిసికొనుము. ఆ యిచ్చిన దాతయొక్క ఘనతను చక్కగా యో

చించినయెడల ఎంత చిన్న ఈవి అయినను తక్కువగా కని పించదు. ఏలననగా దేవునివల్ల యివ్వబడిన ఈవిఎన్నడు స్వల్ప మైనది కానేరదు. ఆయన మనకు శిక్షలను బాధలను గలుగ జేయుచున్నను, మనము అందులకు ఆయన యెడల కృతజ్ఞుల మై యుండవలెను. మనకు సంభవించుటకు ఏది అంగీక రింపబడినను అది మన రక్షణకొరకు ఆయనవలన విధింప బడి నదే. దేవునిఅనుగ్రహమును ఎప్పటికిని నిలుపుకో కోరినవారు దేవుడు అనుగ్రహించిన అనుగ్రహమునకు ఎల్లప్పుడు కృతజ్ఞు లై యుండవలెను. అది మనల తొలగినప్పుడు తిరిగి అది మనకు మరల అనుగ్రహింపబడువరకు మనము దేవుని ప్రార్థిం చుచుండవలెను. దానిని మరలమనము పోగొట్టు కొనకుండా మనము జాగ్రతతోను అణకువతోను ఉండవలెను.

## పదకొండవ ప్రకరణము.

## సిలువయందు ప్రేమగలవారు.



ఏసు పరలోకరాజ్యమును ప్రేమించు చున్నవారిని అనేకులను గలిగి యున్నాడు. కాని ఆయన సిలువను భరింప కలిగినవారు మాత్రము బహుస్వల్పముగా నున్నారు. ఉపశాంతిని కోరుచున్న వారిని అనేకులను ఆయన కలిగియు న్నాడుకాని ఆయనబాధలను భరించకోరినవారు లేరు. ఆయ నతో కలసి ఆయన పంక్తిని భోజనము చేయగోరినవారు పెక్కండ్రు కలరు కాని ఆయనతో ఉపవాసములు చేయకోరిన

వారంతగా కనిపించరు. అందరు ఆయనతో సంతోషించుటకు ఇష్టముకలిగియున్నారు. ఆయనతోగాని లేక ఆయనకొరకుగాని దేనినీ భరించుటకు ఎవరికిని ఇష్టము లేదు. రొట్టెను విరుచుటకు అనేకులు యేసును వెంబడించుచుండిరి. కాని ఆయన భావములయొక్క గిన్నెను త్రాగుటకు ఒకరికైనా ఇష్టమున్నట్టు కనిపించరు. కష్టములు తటస్థించనంతవరకు అనేకులు యేసును ప్రేమించుచుండిరి. ఆయన నుండి ఉపశాంతులను పొందుచున్నంతవరకు అందరు ఆయనను ప్రేమించి కీర్తించుచున్నారు. కాని యేసు వారికి కనిపించక కొద్దికాలము వారిని విడిచిపెట్టినప్పుడు వారు మొర బెట్టుచుందురు. లేదా విచారము చే కృశించుదురు. తమ స్వంతసుఖము నిమిత్తముగాక యేసు నిమిత్తము యేసును ప్రేమించినవారు కష్టమునందును సుఖమునందును ఆయనను కీర్తించుచుందురు. వారికి క్షేమము కలిగించుటకు ఆయన కెప్పుడును ఇష్టము లేక పోయినను, వారు ఆయనను విడిచిపెట్టక వందనముల చెల్లించుచుందురు. యేసుమీది పరిశుద్ధమైన ప్రేమ ఎంత గొప్ప బలము గలది! అది స్వలాభముతోను స్వసుఖముతోను కూడియుండదు. ఉపశాంతులనిమిత్తము ప్రయత్నించువారు కూలివాని వంటివారు కారా? ఎల్లప్పుడు తమతమ స్వంతలాభమును చూచుకొనుచున్నవారు క్రీస్తుకంటె తమ్ము తా మెక్కువగా ప్రేమించుచున్నవారు కారా? ఏలాభమును ఆశింపక దేవుని ఇష్టముతో సేవించువారు ఒకడైనను కలడా ప్రపంచకసంగతులను ఇష్టముతో విడిచిపెట్టగలిగినంత ఆత్మాభివృద్ధి జెందినవాడు మిక్కి

లి అరుదుగా గనిపించును. జీవులమీది మోహమును పూర్తి గావిడిచిపెట్టి హృదయమునందు మిక్కిలి అణకువగలిగియున్న వాడు మన కెక్కడ కనుపించును? వానివిలువ ప్రపంచకము యొక్క చివరనుండియు దూరమునుండియు కనిపించును. మనుష్యుడు తాను కలిగియున్న దానినంతయు విడిచిపెట్టినను అది యొక గొప్ప సంగతి గాదు. మనుష్యుడు కఠినమైన దానిని అభ్యసించినను అదియును ఒకగొప్పవిశేషమైన సంగతి కాదు. యావత్తు జ్ఞానమును పొందగలిగినను అతడు ఇంకను దూరముగా నున్నవాడే అగును. గొప్పయోగ్యతను గాఢమైన భక్తిని గలిగియున్నను ఇంకను వానియందు కొరత గనుపించుచున్నది. మనుష్యునికి ఒక్కసంగతి మాత్రము మిక్కిలి అవసరమైయున్నది. అదేవానికి మిక్కిలిలాభమైనది. అది ఏది? మనుష్యుడు సమస్తమును విడిచిపెట్టుటయే గాక తన్నుకూడా తానువిడిచిపెట్టవలెను. "తాను" అన్న అభిమానమునే పూర్తిగావిడిచి పెట్టవలెను. తనకొరకు దేనిని ఉంచుకొనక సమస్తమును ఉపేక్షింపవలెను. తనకు తెలిసినంతవరకు తాను చేయవలసియున్న దానిని చక్కగా చేసినప్పుడు తానేమీ చేయనట్లు అనుకోవలెను. గొప్పగా ఎన్నబడుచున్న వానిని గొప్పవాడని అనుకోకుము. వాడు నిజముగా వ్యర్థుడైన దాసుడని అనుకొనుము. "మీరు ఆజ్ఞాపింపబడిన వన్నియు చేసినతరువాత మేము నిష్ప్రయోజకులమైన దాసులము" అని చెప్పుకొనుడు. అని సత్యస్వరూపుడైన ఆయన చెప్పుచున్నాడు. అపుడు అతడు నిజముగా మనస్సునందు దీనుడై

ప్రవక్తతో "నేనుఏకాకిని నిరాధారుడను" అని చెప్పుకొనును. అయినను వానికంటె భాగ్యవంతుడెవడును లేడు. అంత బల మైనవాడును మరియొకడు లేడు. అంత స్వేచ్ఛగలవాడును లేడు. ఏలననగా అతడు తన్ను తాను విడిచిపెట్ట గలుగుచున్నాడు. అన్నిటినివిడిచి పెట్టగలుగుచున్నాడు. మిక్కిలి తక్కువ చోట ను తన్ను తాను ఉంచుకొనుచున్నాడు.

## పండ్రెండవ ప్రకరణము.

## పావనమైన సిలువ యొక్క రాజమార్గము.

'ఎవడైనను నావెంబడి రాగోరిన యెడల తన్ను తాను ఉపేక్షించుకొని తనసిలువనెత్తుకొని నన్ను వెంబడింప వలెను' అని యేసు చెప్పిన సంగతి చాలా మందికి కఠినముగా నుండ వచ్చును. "శపింపబడిన వారలారా నన్ను విడిచి నిత్యాగ్ని లోకి పోవుడి" అనుమాట వినిపించినప్పుడు అదిమీకు మరింత కఠినముగా నుండవచ్చును. సిలువయొక్క మాటను విన్న వారును దానిని వెంబడించిన వారును నిత్యాగ్నియొక్క దుర్వా ర్తను వినుటకు భయపడరు. ప్రభువు తీర్పుచెప్పవచ్చి నపుడు ఈ సిలువయొక్క గుర్తు పరలోకములో నుండును. తాము బ్రతికియున్న కాలమున సిలువ వేయబడిన స్వరూపమును అనుసరింప నేర్చిన సిలువయొక్క సేవకులందరు గొప్పనమ్మిక ముతో తీర్పుతీర్చెడి క్రీస్తును సమీపింతురు. సిలువ దేవుని రాజ్యమునకు నిన్ను కొనిపోవుచున్నప్పుడు నీవు దానిని భరిం

చుటకు నీవేల భయపడెదవు ? రక్షకత్వము సిలువలోనున్నది. జీవము సిలువలో నున్నది. శత్రువుల నుండి రక్షించుకొనుట సిలువలో నున్నది. పరలోక మాధుర్యముయొక్క పరిపూర్ణత్వము సిలువలో నున్నది. మనస్సుయొక్క బలము సిలువలో నున్నది. ఆత్మయొక్క ఆనందము సిలువలోనున్నది. యోగ్యతయొక్క హెచ్చు సిలువలో నున్నది. పావనత్వము యొక్క సంపూర్ణత్వము సిలువలో నున్నది. సిలువలోతప్ప ఆత్మరక్షణము బొందదగిన మార్గము మరియొక దానియందు లేదు. శాశ్వత జీవితముయొక్క ఆశ కూడ మరియొక దాని యందు లేదు. కనుక సిలువను పుచ్చుకొని ఏసును వెంబడింపుము.

అపుడు నీవు శాశ్వత జీవితములో ప్రవేశించుదువు. ఆయన సిలువనుధరించి నీకంటె ముందు వెళ్ళెను. ఆయన నీ నిమిత్తము సిలువమీద చనిపోయెను. నీవుకూడా సిలువను ధరించి సిలువమీద చనిపోవుటకు సిద్ధముగా నుండుము. ఏల వనగా నీవుఆయనతో చనిపోయినయెడల ఆయనతోనీవు జీవింతువు. శ్రమలలో ఆయనకు అనుచరుడవై యున్న యెడల ఆనందములోకూడా నీ వాయనకనుచరుడవై యుందువు.

ప్రతిసంగతి సిలువయందున్నది. ప్రతిసంగతి సిలువపై మరణముమీద ఆధారపడుచున్నది. జీవముపొందుటకు అంతకన్న వేరు మార్గమేదియు లేదు. మనస్సులోపల నిజమైన శాంతి గలుగుటకు పావనమైన సిలువయొక్క రాజమార్గము కంటెను నిత్యము తన్ను తాను హింసించు కొనుటకంటెను వేరుమార్గ మేదియులేదు. నీవు ఎక్కడికి వెళ్ళకోరుదువో అ

క్కడికి వెళ్ళుము. నీవు దేనిని చేయ ప్రయత్నింపదలుచుకొంటివో దానిని చేయ ప్రయత్నింపుము. పావనమైనసిలువమార్గమునకంటె హెచ్చైన మార్గమును నీవుపైనకనిపెట్టలేవు. క్రిందనీవంతకన్న ఎక్కువ సురక్షితమైన మార్గమును కనిపెట్టలేవు. నీ ఆనందమునుబట్టియు నీ ఇష్టమునుబట్టియు అన్ని సంగతులను ఏర్పరిచి నియమించుకొనుము. నీ కిష్టమున్నను లేకున్నను నీవు కొంత బాధను ఎల్లప్పుడు అనుభవింప వలసియుందువు. నీకు శరీరములో బాధ కలిగినను మనస్సులో బాధకలిగినను నీ యాత్మ కలత చెందవలసియుండును.

కొన్ని సమయములయందు నీవు దేవునివలనవిడిచిపెట్టబడుదువు. కొన్నిసమయములయందు నీ పొరుగువానివలన పరీక్షింపబడుదువు. ఎక్కువబాధకరమైనదేది? నిన్ను నీవు తరుచు పరీక్షించుకొనుటయే. దేవుని ఇష్టప్రకారము నీవెంతకాలము బాధపడవలెనో అంతకాలమూ బాధపడుటతప్ప ఏపరిహారము వలనను ఏ ఉపశాంతివలనను నిన్ను నీవు కాపాడుకొనలేవు. ఉపశాంతి లేకయే నీబాధల భరింప నేర్చి యుండవలెనని దేవుని అభిప్రాయము. నిన్ను నీవు పూర్తిగా దేవునికి వశపరచి పరీక్షల మూలమున అత్యధికముగా దీనుడవై యుండవలెనని ఆయన ఉద్దేశించెను. తనకు తటస్థమైన దానిని అనుభవించుచున్న వానివలె ఏమనుష్యుడు క్రీస్తు యొక్క భావములను ఇష్టముతో మనస్సున తాకియుండడు. కనుక సిలువ ఎల్లప్పుడు సిద్ధముగా నున్నది. ప్రతిచోటను అది నీకొరకు నిరీక్షించుచున్నది. నీవు ఎక్కడికి పరుగెత్తినను నీవు

దానిని తప్పించుకొనలేవు. ఏలయనగా నీవెక్కడకు వెళ్లినను నిన్ను నీవునీతో తీసుకొనివెళ్లుచుందువు. నీపైన చూడుము. నీ క్రిందచూడుము. నీ లోపల చూడుము. నీవెలపల చూడుము. ప్రతిచోటను నీకు సిలువ గనుపించుచుండును. శాశ్వతమైన జయమును నీవు పొందగోరిన యెడలను నీవు నీ ఆంతర్య విశ్రాంతిని కాపాడుకో గోరినయెడలను ప్రతిచోటను నీవు యోరిమి గలిగియుండుట మిగుల అవసరమైయున్నది. నీవు ఇష్టముతో సిలువను భరించితివేని నీవు కోరిన గమ్యస్థానమునకు అది నిన్ను తీసుకుపోవును. అక్కడ ఇక ఏ బాధలు ఉండవు. ఈబాధలును కష్టములును ఇక్కడనే కాని అక్కడ యేమీ యుండవు. నీవు ఇష్టములేకనే దానిని భరించిన యెడల, నీవు దానిని మరింత భారముగా చేసికొని దాని బరువును నీవు మరింత అతిశయ పరుచుదువు. అయినను నీవు దానిని భరింపక తప్పదు. నీవు ఒక సిలువను త్రోసివేసిన యెడల మరియొక సిలువ నీకు సిద్ధముగా నుండును. అది మరింత ఎక్కువ బరువైనదిగా నుండవచ్చును. మర్త్యుడైన వాడు ఎవడును తప్పించుకొనలేని దానిని నీవు తప్పించుకో గలవని తలచెదవా? ఈ ప్రపంచకములో ఏమహాత్ముడు కష్టములు, పరీక్షలులేకుండా ఉండెను? మన ప్రభువైన యేసు క్రీస్తు ఆయన బ్రతికియున్నంతకాలము ఒక గడియ యైనా మనస్సునందు బాధలేకుండా ఉండెనా? క్రీస్తు శ్రమ పడి మరణమునుండి లేచి మహిమలో ప్రవేశించుట అగత్యము కాదా? ఈ రాజమార్గము కంటె మరియొక మార్గమును

పొందదలచెదవా? సిలువయొక్క రాజమార్గమే రాజమార్గము.

క్రీస్తుయొక్క జీవితమంతయు బాధలతోను మతము కొరకు మరణించుటతోను నిండియున్నది. నీవు విశ్రమించుటకును ఆనందించుటకును కోరుచుంటివా? బాధల భరించుటకంటె నీవు మరియొకదానిని కోరినయెడల నీవు మోసపోయినవాడవగుదువు. ఏలయనగా నరుని జీవితము అనేక చెడుగులతో నిండి అన్ని వైపుల బాధలతో ఆవరింప బడియున్నది. మనుష్యుని ఆత్మ జీవములో అభివృద్ధి చెందినకొలదిని ఆతడు మరింత ఎక్కువ బాధలను అనుభవింపవలసి యుండును. ఎందుచేతననగా ఏకాకియై యుండుటవలన తనకు గలుగుచున్న బాధ దేవునిమీద ప్రేమతో మరింత అతిశయించుచుండును. అయినను మనుష్యుడు అనేక విధములైన బాధల మధ్యనున్నప్పుడు కొంత యుపశాంతి లేకుండా ఉండుటలేదు. ఈ బాధలను భరించుటవలన తానుపొందపోవుచున్న గొప్ప ఫలము వానికి తలపునకువచ్చి కొంతఉపశాంతిని గలిగించుచుండును. దానిని ఇష్టముతో భరించునప్పుడు పరీక్షలయొక్క భారము దేవుని యుపశాంతి యొక్క నమ్మికగా మారును. ఈ బాధలవలన శరీర పటుత్వము ఎంతవరకు తగ్గుచుండునో అంతవరకూ అంతరంగపు ఉపశాంతి వలన హృదయము బలపడుచుండును. క్రీస్తుయొక్క సిలువను అనుసరింపవలెనన్న కోరికతో పరీక్షలను బాధలను కలిగియుండవలెనన్న ఆతురముచేత దుఃఖము, బాధలు లేకుండవలెనని తలచనంత దృఢమైన బలమును గలిగి యుండును. దేవుని నిమిత్తము మిక్కిలి కఠినము లైనట్టి